సత్యనారాయణశాస్త్రి, చివుకుల

వైద్యకల్పద్రుమము

నూజవీడు, 1929

Record no. 383

## Bibliographic Record Target

సత్యనారాయణశాస్త్రి, చివుకుల.
వైద్యకల్పద్రుమము / చివుకుల సత్యనారాయణశాస్త్రిచే రచింపబడినది.- నూజవీడు : ఆయుర్వేద గ్రంధరత్నమాల, 1929.
(2), 4, 170 p. ;15 cm.
Record no. 383

Satyanārāyaṇaśāstri, Civukula.
Vaidyakalpadrumamu / Civukula Satyanārāyaṇaśāstricē racimpabaḍinadi.- Nūjavīḍu : Āyurvēda Grandharatnamāla, 1929.
(2), 4, 170 p. ;15 cm.
Record no. 383

శ్రీ

ఆయుర్వేద గ్రంథరత్నమాలః—ద్వితీయరత్నము.

# వైద్యకల్పద్రుమము.

చిప్రకుల సత్యనారాయణశాస్త్రిచే

రచింపఁబడి,

నూజవీడు,

ఆయుర్వేద గ్రంథరత్నమాలా కార్యస్థానమున

గ్రంథకర్తచేఁ బ్రకటింపఁబడినది.

నూజవీడు

శ్రీగౌరీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె

మూఁడవకూర్పు 1000 ప్రతులు.

1929.



వెల రు 1—4—0.

## పీఠిక.



ఈ చిన్న పుస్తకమున కిది మూడవకూర్పు ఇందు భాషను సంకుచితముచేసి అవసరములగు విషయము లేమియు తగ్గించక అనేక నూతన విషయములను అత్యుత్తమములగు వాని నాయా ప్రకరణములతో జేర్చితిని. ఈపుస్తకమును వైద్యులిదివరలో ఆదరించిన దానికంటె హెచ్చుగ శ్లాఘించ గలరని నమ్ముచున్నాను.

అనవసరమగు ఉపన్యాసములను తావులేకుండ క్లుప్తపరచి పూర్వముకన్న హెచ్చుగ 50 యోగములకుపైగా చేర్చియు పుస్తకము పెరుగకుండ చేసి మామూలు వెలకే యిచ్చుచున్నాను. వైద్యులిందలి దోషములను తెల్పినచో సవరించుకొందును.

గ్రంథకర్త.

# మానములు.

6 సర్షపములు (ఆవగింజలు) - 1 యవధాన్యపుగింజ.

3 యవలు (లేక 4 ధాన్యపుగింజలు) - రతి లేక గుంజ (గురిగింజ)

6 గుంజలు - 2 అణాయెత్తు.

10 గుంజలు లేక రతులు - 1 మాష.

4 మాషలు - 1 శాణము లేక ధరణము లేక టంకము.

2 శాణములు - 1 తులము, కోలా క్షుద్రక వటక లేక ద్రంక్షణము

2 తులములు - 1 కర్షము, అక్షము, తిందుక సువర్ణ ఉదుంబర

2 కర్షములు - 1 శుక్తి అర్థపలము (4 తులములు)

2 శుక్తులు - 1 పలము (8 తులములు)

2 పలములు - 1 ప్రసృతము (16 తులములు)

2 ప్రసృతములు - కుడవము అంజలి (32 తులములు)

2 కుడవములు - మానిక లేక శేరు (64 తులములు)

2 మానికలు - ప్రస్థము (4 శేర్లు. 128 తులములు)

2 ప్రస్థములు - 1 ఆఢకము (8 శేర్లు. 256 తులములు)

4 ఆఢకములు - 1 ద్రోణము (32 శేర్లు)

2 ద్రోణములు (64 శేర్లు) - 1 కుంభము.

100 పలములు - 1 తుల - 12న్నర శేర్లు.

4 కుంభములు - ద్రోణి (128 శేర్లు)

4 ద్రోణులు - 1 ఖారి (512 శేర్లు)

# "దూతలక్షణము."

సీ. వైద్యరాజును బిల్వవచ్చిన మనుజుండు
శిరముముట్టిన కార్యసిద్ధియగును
కుడికన్ను కుడిచెవి కుడిచన్ను ముట్టిన
కుడికడచెయ్యంట కోర్కెలలరు
మెడయురస్థలమును కక్షపృష్ఠభుజంబు
కుడిమీసమును కట్టుకొన్న బట్ట
ముట్టిన సఫలమై మోదమందగజేయు
స్థిరముగ గూర్చున్న సిరులుగల్గు

గీ. నవ్వుచును వచ్చియడిగిన భవ్యమగును
పరగ పీడెంబుచేయుచు పలుకరింప
దగ్గుచును ఉమ్మివేసిన తగినమేలు
కలుగునందురు బుధవరేణ్యులు దలంప.

క. నిండినకడవలు మాంసపు
ఖండంబులు పాలుపెరుగు గంధంబును బూ
దండలు నెదురుగవచ్చిన
పండును తనకోర్కెలెల్ల ఫలమేమందుర్.

సీ. జలములోదిగి వీళ్ళ జలకమాడెడు వేళ
ముద్దుసతితో కలిసినవ్వుచుండు వేళ
వేరొక్కదోవతి విడచికట్టెడు వేళ
భుజియించియును నిద్రబోవు వేళ

వ్యసనరోదన శోకహాతి సహించెడు వేళ
విణ్మూత్రములు జారవిడుచు వేళ
క్షౌరతైలాభ్యంగన స్నాతయగు వేళ
వెంట్రుకల్ తలముడి విప్పు వేళ

గీ. వచ్చిపలికించు వెడ శాస్త్రవైద్యవరులు
భూతలంబున వచ్చు నాదూతవరుల
వేగబలిహారముల జెప్పి విడువవలయుఁ
దీనిదా వ్యాధి కాకున్నఁ దీర్ఘపడును.

సీ. పదములపైఁబడి ప్రార్థింపఁగారాదు
ముకుళితహస్తులై మ్రొక్కరాదు
గద్దరంబుఁజేయినట్టి కౌఁగిలింపఁగరాదు
స్థిరముగాఁజేయుఁబట్టి తీయరాదు
తబ్బిబ్బుగాఁ గోరు తత్తరపడరాదు
వెవరెంగచిన్నగాఁ బిలువరాదు
వణకుచు దేహంబు వడివిప్పఁగారాదు
హాయని నిట్టూర్పు మూడరాదు

సీ. ఇంచుకంతైనఁ గన్నీరు సించరాదు
త్రుంచి తృణములు మాటిమాటికావులించరాదు
నిల్వరాదొకకాలను నిలువరాదు
వైద్యరాజులకడకేగు వసువులందు.

క. కొడవలికత్తియు గొడ్డలి
బడితెయుఁ జేఁబట్టివచ్చి ప్రార్థించినతోఁ



గష్పేప్పుచేవ నైనను
సుఖగమితదోర్గి రోగమూహింపుఁడిలన్.

క. చెప్పెడునెడఁ దలవిడిసను
జెప్పంచుఁదలముడిచికొన్నఁ జెప్పకముఱిదా
జెప్పలనీరొలికించిన
నొప్పదు రోగస్థునకును నూహింపంగన్.

గీ. చెప్పవచ్చిన నరుఁడందు జారిపడిన
అచటనిద్రించ శయనించ నావులించ
చెలగివిలపించ తృణములు చేతత్రుంచ
మించిచనుదెంచవలదు వర్జించవలయు

గీ. కులజునకుదూత కడుహీనకులజుడైన
మూకజాత్యంధ బహువృద్ధ మూర్ఖులైన
రోగితానైన దూతయు రోగియైన
కుదుటపడదదిగానక కర్కాత్రివలదు.

సీ. పిలువవచ్చెడువేళ తలగోకికొన్నను
తనువుగోకిన కీడు దప్పదండ్రు
యెడమచెవ్యొడమచన్నొడమ కన్నొడమ మీ
సనునాసికము పూరుషంబు వెన్ను
గడంబునసుమును కర్ణద్వయంబు మును
గురులునంటిన కార్యకరముగాదు
గోఁకుగ్గుచు వణకిన గొంతుగూర్చుండిన
చరణముల్ బెనచిన జయముగాదు

గీ. వారు పెండెము చెయ్యాన శుభములోలగు
కోలనేలనువాల్చిన కోర్కెతోలగు
ఫుల్లలాకులువ్రుంచిన వల్లపడము
తగనిశకునంబు లరసిపోగూడదటకు.

సీ. తత్తరపడిలేచి ధరణిపై బడెనేని
తనకాలికోకముల్లు దాకెనేని
కాలివేలికిరాయి కడపనొందిననేని
తలచీరెకును కంపదగిలెనేని
చేతిమందులసంచి చెయిజారిపడెనేని
దురుసుగా వెనువెంట తుమ్మెనేని
యెవరుగనెవరైన నెచ్చటికనిరేని
బల్లియు కుడిప్రక్క బల్కెనేని

గీ. పాల ముంగిస యెలుకయు పంది శశము
గూబ పిల్లియు తొండను కూర్మములును
కనులబడెనేని చనరాదు కాలగతుల
కూడియుండును తద్రోగి కూలునపుడె.

గీ. ఇట్లను ధన్వంతరి సరిగానెంచియెంచి
వైద్యవరులను బూజింపవలెనుజాల,
ధనగజాశ్వాది వస్త్రవాహనములొసంగి;
తెవులు సడయించు వైద్యులు తృప్తులైన.



శ్రీ రస్తు.

# వైద్యకల్పద్రుమము.



శ్లో॥ నమామి ధన్వంతరి మాదిదేవం
సురాసురైర్వందిత పాదపద్మం
లోకేజరారుగ్భయ మృత్యునాశం
దాతారమీశం వివిధౌషధీనాం॥

## నాడీపరీక్ష

వైద్యుడుముందుగా నాడి, స్పర్శ, రూపము, శబ్దము, నేత్రములు, మూత్రము, పురీషము, నాలుక అను నీ 8 స్థానములను పరీక్షించి రోగతత్వములను నిర్ణయించుకొని చికిత్సారంభము చేయవలెను. గాన వానిని ముందుగా తెలుపుచున్నాము.

వైద్యుడు రోగియొక్క దక్షిణ హస్తమును తన వామహస్తముచే చక్కగా పిసికి ఆహస్తముయొక్క అంగుష్టమూలమునందు తన దక్షిణ కరాంగుళిత్రయమునుంచి పరీక్షింపవలెను.

## నాడీలక్షణము.

సర్పము, జలగ, ఆందోళికము వీని గమనము గలిగి వక్రముగ నుండునెడల వాతనాడి యనబడును.

కప్ప, చిలుక, కాకి వీనిగమనము గలిగి చంచలముగనున్న పిత్తనాడియని తెలిసికొనవలెను.

కోడి, పావురము, ఊరబిచ్చుక వీని గమనము గలిగి స్థిరముగనుండిన శ్లేష్మనాడియనబడును.

సర్పమువలెను, కప్పవలెను నడచునెడల వాతపిత్త నాడియనియు, పలుమారు సర్పము కోడివలె నడచిన వాతశ్లేష్మ నాడియనియు, కప్ప, కోడివలె నడచిన పిత్తశ్లేష్మ నాడియనియు, వక్రముగను, చంచలముగను, మందముగను, పలుమారు నడచిన సన్నిపాత నాడియనియు నెరుంగవలెను.

నాడి స్వస్థానమును విడువక నిర్మలముగ చలన రహితముగ నడుచుట సాధ్యనాడియనియు కడుస్థిరముగ కష్టము మందముగ సూక్ష్మముగ వక్రముగ నడచిన అసాధ్యనాడియనియు గుర్తించవలెను.

—♦ స్పర్శలక్షణము. ♦—

వాతరోగికి శరీరము కొంచెము ఉష్ణముగను పైత్త రోగికి మిక్కిలి ఉష్ణముగను, లేక మిక్కిలి చల్లగను, శ్లేష్మరోగికి కొంచెము చల్లగను ద్వంద్వరోగికి భిన్నముగను ఉండును.

—♦ రూపలక్షణము. ♦—

వాతరోగమందు శరీరము నల్లగను, పిత్తరోగమున పచ్చగను లేక యెఱ్ఱగను, శ్లేష్మరోగమున తెల్లగను, ద్వంద్వరోగమున మిశ్రవర్ణముగను ఉండును.



—♦ శబ్దలక్షణము. ♦—

వాతరోగమున సమముగను, పిత్తరోగమున అధికముగను శ్లేష్మరోగమున హీనముగను మిశ్రరోగమున మిశ్రముగను మాటలాడుచుండును.

—♦ నేత్రలక్షణము. ♦—

వాతరోగికి కన్నులు నల్లగను, లేక కొంచెము ఉబ్బుగను, నీరు కారుచుండును. పిత్తరోగికి పచ్చగను లేక యెఱ్ఱగను ఉండును. శ్లేష్మరోగికి పుసికట్టి తెల్లగానుండును. సన్నిపాత రోగికి కన్నులు పచ్చగా గాని యెఱ్ఱగాగాని ఉండును. కామిలా రోగికి పచ్చగానుండును.

—♦ మూత్రలక్షణము ♦—

వాతరోగమందు మూత్రము తెల్లగను పిత్తరోగమందు యెఱ్ఱగను, కామిలా రోగమందు పచ్చగను శ్లేష్మరోగమందు తెల్లగను నురుగుకట్టియు ద్వంద్వరోగమందు మిశ్రవర్ణముగను ఉండును.

రోగియొక్క మూత్రము పరీక్షింప దలచినప్పుడు రోగిని ప్రాతఃకాలమున మేల్కొలిపి స్వచ్ఛమై తైలసంబంధములేని మట్టిపాత్రయందు మూత్రము విసర్జించునట్లుచేసి దానిని యెండలో నుంచి దానియందొక తైలబిందువును వేసి రోగసాధ్యాసాధ్యముల దెలిసికొనవలెను. ఎట్లన ? తైలబిందువు విక

సించినను లేక మేడ ఏనుగు వింజామర గొడుగు తోరణము వీనిలో దేనిరూపమునైన బొందినను రోగము శీఘ్రసాధ్యమనియు బిందురూపముగనే యుండెనేని రోగము కష్టసాధ్యమనియు లోపల మునిగిపోయినను సర్పము కోతి పిల్లి ఎలుక పంది తేలు వీనిలో దేని యాకృతినేని బొందినను రోగి తప్పక మృతినొందు ననియు గ్రహింపవలెను.

వాతమేహరోగి మూత్రమును మట్టిపాత్రలో బోసి సన్నపు సెగను కాచినచో చిక్కనై 5 వభాగము మిగిలినను పిత్తజ మేహ దోష మూత్రము 7 వ భా॥ మిగిలినను కఫజ మేహరోగి మూత్రము 9 వ భా॥ మిగిలినను ఆరోగము సాధ్యముగ నుండును.

—♦ పురీషలక్షణము. ♦—

వాతరోగమున పురీషము బద్ధమై నల్లగను పిత్తరోగమున మలము పచ్చగను లేక యెఱ్ఱగను శ్లేష్మ రోగమున తెల్లగను లేక నురుగుకట్టియు బంకగను ద్వంద్వ రోగమున మలము మిశ్రవర్ణమై యుండును.

—♦ జిహ్వాలక్షణము. ♦—

వాతాన నాలుకపగిలి ముండ్లవలెను పిత్తమున ద్రవము తెల్లగనుండు కఫమున బారి ద్రవములేక నల్లగా నుండిన సన్నిపాతము మిశ్రవర్ణమైన ద్వంద్వము.

---



# జ్వ ర ప్ర క ర ణ ము.

—♦ జ్వరగజాంకుశరసము ♦—

రసము, గంధకము, నేపాలములు, పొంగించిన వెలిగారము వీనిని సమభాగముగ గ్రహించి నిమ్మపండ్లరసముతో మర్దించి మినపగింజంత మాత్రను తమలపాకురసముతో నిచ్చిన సంతత, తరుణ జ్వరములుహరించును. చక్కగా విరేచనము చేయును.

—♦ వైష్ణవీరసము. ♦—

ఇంగిలీకము, నాభి, కటుకరోహిణి, శొంఠి, పిప్పలి, మిరియాలు వీనిని సమభాగముగ చిత్రమూలరసముతో మర్దించి ఒకజాము డోలా యంత్రమున చిత్రమూల కషాయముతో వండి గుంజాప్రమాణమగు మాత్రలుచేసి అల్లపురసముతో నిచ్చిన ద్వంద్వజ్వరములు, విషమజ్వరములు నశించును.

—♦ స్వచ్ఛందభైరవరసము. ♦—

రసము, గంధకము, నాభి ఇవిప్రత్యేకము 1 భా॥ జాజికాయ ½ భా॥ అన్నిటిలో సగము పిప్పలిచూర్ణము వీనినేకముచేసి తమలపాకు రసముతో మర్దించి 2 గురిగెందలంత మాత్రలుచేసి అల్లపురసముతో సేవించిన శీతజ్వరములు, విషమ జ్వరములు, పీనస, పక్షిసెము, జీర్ణజ్వరము, తలనొప్పి, వాతలి, అగ్నిమాంద్యము మొదలగు వికారములను శాంతింపజేయును.

—♦ జ్వరాంకుశరసము. ♦—

రసము, గంధకము, నాభి, శొంఠి, పిప్పలి, మిరియాలు ఇవిప్రత్యేకము 1 భా॥ నల్లఉమ్మెత్తగింజలు 3 భా॥ వీనిని ఖల్వమందుంచి నిమ్మపండ్ల రసముతో మర్దించి గురుజాప్రమాణముగు మాత్రలగావించి అల్లపురసముతో పుచ్చుకొనిన ఆహ్నికజ్వరము నశించును.

—♦ పాశుపతాస్త్రము. ♦—

రసభస్మము, తామ్రభస్మము, గంధకము, మణిశిల, ఉల్లిపాషాణము, గౌరీపాషాణము వీనిని సమభాగముగగ్రహించి గుంటకలగరాకురసముతో 2 దినములుమర్దించి మాత్రలుచేసి గాజుకుప్పెలోబోసి వాలుకాయంత్రమున తీవ్రాగ్నిచే రెండుజాములువండి స్వాంగశీతలముసదీసి, బలానుసారముగు మాత్రను అల్లపురసముతోనిచ్చిన ఆహ్నిక జ్వరములన్నియుపోవును.

—♦ సింహప్రతీపాలసము. ♦—

రసము గంధకము నాభి గరళము వీనిని సమభాగములుగా కూర్చి హంసపాదిఆకురసముతో మర్దించి గురిగింజలంత మాత్రలుజేసి అనుపానవిశేషములతో నిచ్చిన జ్వరములు దోషజ్వరములు హరించును.

—♦ హుతాశనరసము. ♦—

చంగల్వకోష్టు గంధకము నాభి శొంఠి పిప్పళ్లు మిరియాలు కరక్కాయ తాడికాయ ఉసిరికాయ



పాదరసము వీటిని సమభాగములుగ గుంటగలగరాకురసముచే మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి సేవించిన అజీర్ణజ్వరములు శ్వాసకాస ఇవి శమించుటయేగాక అగ్నిదీపనము రుచి వీటినిగలుగజేయును.

—♦ ఆనందభైరవము. ♦—

వెలిగారము, ఇంగిలీకము, పిప్పళ్లు నాభి మిరియాలు వీటిని సమభాగములుగ నిమ్మపండ్ల రసముచే బాగుగా మర్దించి కంది గింజలంతేసి మాత్రలుచేసి సేవించిన సర్వజ్వరములు హరించును. దీనిని నేత్రముల కంజనము వేయవచ్చును.

—♦ జ్వరమురారి. ♦—

ఒకతులము శుద్ధిచేసిన సవీరమును చూర్ణించి ఖల్వములోబోసి దానిపైన మూడుతులముల మిర్యాలుపరచి ఆమిర్యాలపైన మూడుతులముల సీమనేపాలపుగుళ్ళు కత్తిరించి పరచి ఇవియన్నియు మునుగునట్లు నిమ్మపండ్లరసమునుపోసి ఒకరాత్రి నిలవయుంచి ఉదయమున మెత్తగా నూరి మాత్ర పదనునకు వచ్చినపిదప మరియొక నిమ్మపండు రసముపోసి నూరి కందిగింజలంత మాత్రలు చేసేది. యుక్తమగు అనుపానములతో సర్వజ్వరములందును వాడదగును.

—♦ దరదవటి. ♦—

ఇంగిలీకమును వేపనూనెలోవేసి రెండుగడియలు

నండి నిమ్మపండ్లరసముతో మూడుదినములు భావన చేయవలెను. ఇట్లు మూడుసారులు నండి మూడుసారులుభావనలుచేసి నిమ్మపండ్లరసముతో మూడుదినములుమర్దించి కందిగింజలంత మాత్రలుచేయవలెను జీర్ణజ్వరములందు జీలకర్రరసము తెల్లగలిజేరు రసము దానిమ్మపండ్లరసము మున్నగువానితో నిచ్చిన అమోఘ ఫలప్రదముగనుండును.

—♦ విషమజ్వరాంతకవటి. ♦—

జెముడుకాడల రసము అర్ధశేరు, ముండ్లతోటకూరరసం అర్ధశేరు, వేరేవేరే తీసి కొలిచి కలుపవలెను. ఈ శేరురసమును పావుశేరు చొ॥ నాలుగు పాత్రలలోపోసి తులము ఉల్లిపాషాణమును బొగ్గు నిప్పులమీద కారుతో పట్టుకొని కాచి వేడియెక్కిన తోడనే పైరసమున చల్లార్చుచు మరలకాచుచు మరలచల్లార్చవలెను ఇట్లు ఒక్కొక్క పాత్రలో 15 సార్లు చల్లార్చునది పాషాణపుముక్క క్రమముగ విరిగి పొడి పొడిగ రసమునందు పడిపోవును. పూర్తిగా ముక్కలై పొడిగ నగువరకు కాచి చల్లార్చుచు అన్నిపాత్రలలోనుండు రసమును పాషాణపు చూర్ణమునుగూడ ఒక్కపాత్రలోబోసి రసము యిగురువరకుకాచి పాషాణచూర్ణమును గ్రహించి దానికి సమముగ యింగిలీకమును రెండుతులములు పచ్చపెసలునుచేర్చి మూడు



దినములు అల్లపురసముతోను మూడు దినములు నిమ్మపండ్లరసముతోను నూరి పెసరగింజలంత మాత్రలుచేయవలెను. చలిజ్వరములందు పనిచేయును.

—♦ పంచతిక్తవటిక. ♦—

నేలవేము, చేదుపొట్ల, కటుకరోహిణి, వేపవేరుపట్ట, అడ్డసరము వీనిచూర్ణము ప్రత్యేకమొకతులము శీతాంశురసము $\frac{1}{4}$ తు॥ నల్లఉమ్మెత్తగింజలు $\frac{1}{4}$ తు॥ ఉల్లిపాషాణము, శంఖపాషాణము, గౌరీపాషాణము మూడునుకలసి ఒకతులము, వీనిని నిమ్మపండ్లరసముతో ఒకదినము మర్దించి పెద్దావాలవలెమాత్రలుచేసి యుపయోగించవలెను. అవసరమునుబట్టి దినమునకు 2, 3 మాత్రలు యివ్వవచ్చును. అన్నివిధములైన చలిజ్వరములు అమోఘముగ కుదురును. జ్వరము ఆగినవెనుకగూడ 5 దినములవరకు మాత్రలను దినమునకొకటి రెండుచొ॥ యిచ్చుచుండవలెను.

విషమజ్వరములకు శోధనము—నెలలనుండి బాధించు చలిజ్వరములకు ముందుగ వమన విరేచనశోధనములంజేయుట అత్యుత్తమపద్ధతి.

ఉదయమునవే రోగికి గోరువెచ్చనిపాలుగాని ఉప్పుకలిపిన వేడినీళ్ళుగాని పావుశేరువరకు త్రాగించి పుంగకాయల రసమును 5 తులములు మొదలు 10 తు॥ వరకు త్రాగించవలెను. వెంటనే సులభముగ

వమనమగును. వమనము రానిచో వ్రేళ్ళతోగాని కోడియీకతోగాని గొంతుకలో కదిపినచో వమనమగును. ఇట్లు వమనమైనవెనుక లఘువైన యాహారమిచ్చి మరునాఁడుదయము ఆముదము చేత విరేచనముచేయించి మూఁడవదినమున పైమాత్రలనుపయోగించవలెను. నిస్సంశయముగ యెట్టి మొండిజ్వరమైనను తగ్గును అనేకరోగులపై పరీక్షించిన సిద్ధప్రక్రియ.

### —♦ చంద్రహాసరసము. ♦—

రసము 2 భా॥ గంధకము 6 భా॥ ఇంగిలీకము 2 భా॥ వెలిగారము 4 భా॥ నాభి 2 భా॥ మణిశిల 2 భా॥ సురాకారము 4 భా॥ శొంఠి పిప్పలి మిర్యాలు మూఁడునుకలసి 16 భా॥ లవంగము ఏలకులు యివి మూఁడేసిభా॥ జాజికాయ నేపాలములు ప్రత్యేకము రెండుభా॥ వీనిని నిమ్మపండ్లు, గుంటగలగర, వావిలి, తమలపాకులు, అల్లము, త్రిఫలములు వీని రసములచే ప్రత్యేకము ఒకజాము మర్దించి కందిగింజలవలె మాత్రలు చేయవలెను. యుక్తానుపానముతో సకల జ్వరములందును వాడనగును. రాత్రి పరుండబోవునపుడు ఒకమాత్రను సేవించునెడల ఉదయమున చక్కఁగ విరేచముచేసి మలబద్ధమును మాన్పును. ఇందు నేపాలముల భాగమును హెచ్చుజేసి 5 భాగములువేయుట కొన్నిచోట్ల ఆచారముకలదు.



### —♦ కల్పతరురసము. ♦—

రసము గంధకము నాభి తామ్రభస్మము వీనిని సమముగ గ్రహించి చక్కఁగ చూర్ణించి చేప నెమలి దున్నపోతు అడవిపంది మేకపోతు వీనిపిత్తములచే ప్రత్యేకము ఒకదినముభావనచేసి పిదప వావిలిరసముచే మూఁడుదినములు అల్లపుస్వరసముచే 3 దినములు మర్దించి కందిగింజలంత మాత్రలుచేయవలెను. జీర్ణజ్వరము విషమజ్వరము జ్వరాతిసారము గ్రహణి పాండువు కామిల అను రోగములందును పనిచేయును. శ్వాసకాసలు శూల వీనితో గూడిన జ్వరములందు దీనినుపయోగింపరాదు.

### —♦ జ్వరములకు పథ్యములు. ♦—

చిర్రికూర పొట్లకాయ పాతబియ్యపు అన్నము వేపపువ్వు పెసరకట్టు జాంగలమాంసము లేత వంకాయ కాకరకాయ బీరకాయ అవునుజ్జిగ.

### —♦ అపథ్యములు. ♦—

వమనముజేయించుట, కాష్ఠముతో దంతశుద్ధిజేయుట, గురుపదార్థములను భక్షించుట, పులుపు, పనస, గానుగపిండి, క్రొత్తధాన్యములు, పిండివంటలు పుష్టిగలపదార్థములు, స్త్రీసంగమము, స్నానము.

## సన్నిపాత ప్రకరణము.

### —♦ కాలకూటరసము. ♦—

నాభి 11 భా॥ పాదరసము 3 భా॥ గంధకము 5 భా॥ మణిశిల 6 భా॥ తామ్రభస్మము 4 భా॥ వెలిగారము 6 భా॥ తాళకము 9 భా॥ చిత్రమూలము 9 భా॥ త్రిఫలములు 10 భా॥ త్రికటుకములు 12 భా॥ ఇంగువ 1 భా॥ వస 1 భా॥ వీనిని ఖల్వములో నునిచి అల్లము, చిత్రమూలము, నిమ్మపళ్ళు వెల్లుల్లి, బండిగురివెందవేరు, కారుమునగచెక్క, జిల్లేడువేళ్లు, చన్నచర్లగడ్డ, హంసపాదియాకు, తమలపాకులు, వావిలాకు, ఊడుగువేళ్లు, మునగవేళ్ళచక్క వీని రసములచే ప్రత్యేకముగ నొక్కొక్కఝాముమర్దించి పిదప పంచకోల కషాయముతో నొకదినము, పంచమూలకషాయముతో నొకదినము మర్దించి గురిగింజలంతేసి మాత్రలుజేసి అల్లపురసముతో సేవించిన అసాధ్యసన్నిపాతములు, సప్తవిధదోషములు సర్వజ్వరములు హరించును.

—♦ సన్నిపాతభైరవరసము. ♦—

తాళకము, గంధకము, పాదరసము ఇవి సమభాగములు. వీనికిసమము నాభి, మణిశిల, వెలిగారము ఇవి తాళకముతోసమము. వీనికన్నిటికి సమము ఇంగిలీకము. వీటిని చిత్రమూలపురసముతోను, అల్లపురసముతోను, నిమ్మపళ్ళరసముతోను మర్దించి మినపగింజలంతేసి మాత్రలుచేసి అనుపాన విశేషములతో



వాడిన సన్నిపాతములు త్రిదోషాతిసారములు కఫ పాండువు కుక్షిశూల ఉదావర్తము అరోచకము హరించును.

—♦ సమగరళతరుణార్కము. ♦—

తాళకము ఇంగిలీకము ఇవిసమభాగములు యీరెంటికి సమము నాభి, వీనికన్నిటికి సమముగరళము. వీనిని మాగీఫలరసముచే మర్దించి పెసరగింజలంత మాత్రలుచేసి కొబ్బరికాయ నీరుతో నొసంగి శైత్యోపచారము చేయుచుండిన సకలమైన సన్నిపాతములు హరించును.

—♦ శీతాంశురసము. ♦—

తాళకము మణిశిల ఇవి ఒక్కొకభాగము, త్రికటుకములు 2 భా॥ వీనిని వేపచక్కరసముచే బాగుగ మర్దించి 2 గురిగింజలంతేసి మాత్రలు చేసి తేనె కరక్కాయ చూర్ణము ఉష్ణోదకము అల్లపురసము వీని యనుపానములతోడ సేవించిన శీతజ్వరములు సన్నిపాతము పాండువు కామిల ఐదుగుల్మములు సమస్త కాసశ్వాసలు ఉదరరోగ పూర్వరూపములు సన్నిపాతములు వాంతి ఎనుబది వాతములు నలువదిపిత్తరోగములు మూలశంక రోగము నాభి కుక్షులయందు జనించెడుబల్లలు కడుపుబ్బరము ఆనాహము విష్టంభము తాపము సర్వాంగముల దాహము స్థావర

జంగమ విషములు, ఎక్కిళ్లు అగ్నిమాంద్యము శోఫ భ్రమ మూర్ఛరోగము తిమిరరోగము హరించును. మఱియు దీనిని వేపాకురసముతో చాది లేపనముచేసిన గజచర్మము విసర్పి మండలకుష్ఠము శరీరమున పొట్టుగలె ఉండెడిరోగము హరించును. మఱియు గ్రంథులు అర్బుదము వీనియందు కత్తివాట్లువేసి వేపరసముతో నూరి లేపనముజేయుటయేగాక దాని సేవనముగూడా చేయుచుండిన గ్రంథులు అర్బుదము హరించును. మఱియు వేపరసముతో నూరి లేపనము చేసిన దంతరోగములు జిహ్వారోగములు నేత్రరోగములు హరించును. జిల్లేడాకురసముతో నూరి చెవిలో వేసిన కర్ణరోగములు వావిలాకు రసముతో నూరి నస్యముచేసిన అపస్మారములు శిరోరోగములు నిమ్మపండురసముతో నూరి ఆవగింజంత కన్నుల కలికము చేసిన నేత్రరోగములు భూతచేష్టలు హరించును.

—♦ ఆనందభైరవి. ♦—

ఇంగిలీకము 4 భా॥ వెలిగారము 8 భా॥ పిప్పళ్లు 12 భా॥ నాభి 20 భా॥ వీనిని అల్లపురసముచే మర్దించి గురిగింజలంతమాత్రలుచేసి అల్లపురసముతో నిచ్చిన సమస్త సన్నిపాతములు సప్తవిధ దోషములు హరించును.



—♦ పాశుపతాస్త్రరసము. ♦—

ఉల్లిపాషాణము, గౌరీపాషాణము, మైలతుత్థము పాలతుత్థము, నేపాళములు, తాళకము, నాభి ఇవి సమభాగములు వీనికన్నిటికి సమాంశము రసము వీటినన్నిటిని జిల్లేడుపాలతో మర్దించి డోలాయంత్రమున నొక యామమువండి సాంగశీతలమున దీనిని చూర్ణించి పాముచేమచేభావనజేసి గుంజామాత్రము వెల్లుల్లిరసముచే బ్రహ్మరంధ్రమునందు కత్తిచే చివ్వి లేపనముచేసిన సన్నిపాతములు హరించును.

జ్ఞాపిక:— మఱికొన్ని యోగములను వాతవ్యాధి ప్రకరణమున చూడుడు.

—♦ అంజనము. ♦—

ఆముదపువిత్తులు, ఇంగువ వీటిని నిమ్మపండ్లరసముచే మర్దించి అంజనము వేయవలెను.

—♦ దోషజ్వరమున అంజనము. ♦—

జొన్నగింజ, మిరియపుగింజ, నల్లినెత్తురు, మూర్కొండాకురసంతో అరగదీసి కలికం వేయవలెను.

—♦ దివ్యాంజనము. ♦—

త్రికటుకములు, కరక్కాయ, తాడికాయ, సైంధవలవణము, ఇంగువ వీనిని సమభాగములుగ గోమూత్రమున మర్దించి మాత్రలుచేసి నిమ్మకాయ రస

ముతో అరగదీసి కన్నులయందు కలికము వేసిన సన్నిపాతములు హరించును.

—♦ నారికేళాంజనము. ♦—

రసకర్పూరము 1 భా॥ నేపాలములు 2 భా॥ తాటిబెల్లము 3 భా॥ కొబ్బరిపెంకులమసి ½ భా॥ వీనిని కొబ్బరిపాలతో నూరి భద్రపరచునది. ఇది దారుణ సన్నిపాతములందుపయోగించవలెను.

—♦ నస్యము. ♦—

అల్లపురసముచేత నస్యముచేయించవలెను.

—♦ అనుపానములు. ♦—

శొంఠి, పిప్పలి, మిరియాలు, సైంధవలవణము, వావిలి, మునగవేరు, ఉలిమిడివేరు, జిల్లేడువేరు, యవక్షారము, వరగోగు, చిత్రమూలము, అల్లము, పిప్పలిమూలము, పంచకోలములు దశమూలములు.

గ్రహణి-అతిసార-జ్వరాతిసార-ప్రకరణము.

—♦ ఉత్పలషట్కము. ♦—

కోలపొన్నవేరు ముత్తవపులగపువేరు మారేడువేరు శొంఠి ధనియాలు వీనికషాయము జ్వరాతిసారమును హరించును.

—♦ హ్రీబేరాదిక్వాథము. ♦—

కురువేరు అతివస తుంగముస్తలు మారేడువేరు ధనియాలు శొంఠి వీనికషాయమున్ను సేవించిన శూ



లను పోగొట్టును. శూలదోషమును గల్గించు ఆమమును పక్వముచేయును. జ్వరముతో గూడినట్టియు జ్వరములేనట్టియు రక్తపుజీర గలిగినట్టియు అతిసారమును హరించును.

—♦ కళింగాదిక్వాథ. ♦—

కొడిశపాలవిత్తులు అతివస శుంఠి వాయువిడంగములు వట్టివేరు దూలగోవెలవేరు వీనికషాయము జ్వరాతిసారమును తాపమును హరించును.

—♦ కళింగాదిగుటికలు. ♦—

కొడిశపాలవిత్తులు మారేడువేరు నేరేడువిత్తులు మామిడిజీడిపలుకులు వెలగకాయ రసాంజనము లక్కపుడకలు మానుపసుపు పసుపు కురువేరు కాయఫలము దుండిగపుచెక్క లొద్దుగుచెక్క బూరుగుజిగురు ఆరెపువ్వు మర్రియిగుళ్ళు వీనిని సమముగ గ్రహించి బియ్యపుకడుగుతో నూరి కుంకుడుగింజలంత మాత్రలుచేయునది బియ్యపుకడుగుతో జామునకు ఒకటి రెండు మాత్రలు వాడిన రక్తాతిసారము జ్వరము శూల హరించును.

—♦ కనకసుందరము. ♦—

ఇంగిలీకము మిరియాలు గంధకము పిప్పళ్లు వెలిగారము నాభి ఉమ్మెత్తవిత్తులు వీనిని సమభాగములుగా గంజాయి యాకు రసముతో నొకజాము [illegible]

సెనగగింజలంతేసిమాత్రలుజేసి సేవించిన అగ్నిమాంద్యము తీవ్రజ్వరము సర్వాతిసారములు గ్రహణులు హరించును.

## —♦ మరీచవటకములు. ♦—

ఉమ్మెత్తవేళ్ళ కల్కము మిరియము సమముగ గలిపి రెండుగుంజలెత్తు మాత్రలు జేసి తెల్లఆవనూనెతో సేవించిన గ్రహణికట్టును.

## —♦ ఆనందరసము. ♦—

జాజికాయ ఇంగిలీకము సైంధవలవణము గవ్వలభస్మము శొంఠి నాభి ఉమ్మెత్తవిత్తులు పిప్పళ్ళు వీనిని సమభాగములుగ గ్రహించి ఉమ్మెత్తవేళ్ళరసమున మర్దనచేసి గురిగింజలంతేసి మాత్రలుచేసి నీడనుయెండించి సేవించిన గ్రహణ్యాతిసారములు జఠర రోగములు వాతకఫశూలలు హరించును.

## —♦ జంబ్వాదిచూర్ణము. ♦—

నేరేడువిత్తులు మామిడివిత్తులలోని పప్పు దానిమ్మకరకాయ పిప్పళ్లు ఖర్జూరపుపళ్లు బూరుగుపట్ట అత్తిపట్ట వీటిని సమభాగములుగ చూర్ణించి తేనెజేర్చి భక్షించిన రక్తపిత్తమువలన బుట్టిన అతిసారములు గ్రహణులు హరించును.

## —♦ శుంఠ్యాదిచూర్ణము. ♦—

లొద్దుగ అతివస బిల్వఫలము శుంఠము ముస్తము



మామిడివిత్తులలోనిపప్పు కొడిశపట్ట వీటిని సమభాగములుగ చూర్ణించి బర్రెమజ్జిగతో సేవించిన గ్రహణ్యాతిసారములు నివర్తించును.

## —♦ సేతుబంధవటి. ♦—

ఇంగువ వేపజిగురు నల్లమందు దాల్చినచెక్క కుంకుమపువ్వు యివి సమభాగములు సోపుకషాయముతో గురిగింజలంత మాత్రలు చేయునది. గ్రహణీరోగమునకిది అత్యుత్తమయోగము.

## —♦ ఖదిరసారచూర్ణము. ♦—

నల్లకాచు చూర్ణము ఒకచిన్నము తేక రెండుచిన్నములు 5 తులముల గేదెపెరుగులో వేసి త్రాగిన చీము రక్తము కలసి పడునట్టి వ్యాధి నివర్తించును.

## —♦ పథ్యములు. ♦—

పొట్లకాయ కొడిశకాయ పులిచింత అరటిదుంప మారేడుకాయ మేకపెరుగు తెల్లఆవనూనె పెద్దమానుచెక్క వెలగపండు కందికట్టు అరటిపువ్వు.

## —♦ అపథ్యములు. ♦—

నువ్వులు అనుములు గుమ్మడికాయ ఆకాకరకాయ బచ్చలికూర ఆనగకాయ కందగడ్డ పిండివంటకములు మాంసము కల్లు బెల్లము శీతకరవస్తువులు పులుసు జడదేహార్థములు స్నానము స్త్రీసంగము.

## క్రిమి ప్రకరణము.

### —♦ ఖదిరాదిచూర్ణము. ♦—

చంద్రచెక్క, కొడిశచెక్క, వేపచెక్క, వస, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక, తాడి, యుసిరిగలు వీనిని సమభాగములుగ చూర్ణించి వీనికన్నిటికి సమముగ తెల్లతెగడచూర్ణముచేర్చి, పావులాయెత్తువరకు గోమూత్రముతో ఉదయమున సేవించు చుండిన 8 దినములకు పూర్తిగ క్రిములునశించును.

### —♦ విడంగాదియోగము. ♦—

వాయువిడంగములను కలితో నూరి ఉసిరిగకాయంతముద్దను ప్రాతఃకాలమందు సేవించు చుండిన నిశ్చయముగ క్రిములునశించును.

### —♦ కృమిముద్గరరసము. ♦—

రసము గంధకము అజామోదము వాయువిడంగములు విషముష్టిగింజలచూర్ణము మోదుగుమాడలు యివి ఏకోత్తరవృద్ధిగ (రసము 1 భా॥ గంధకము 2 భా॥ అజామోదము 3 భా॥ యిట్లు ఒకదానికన్న నొకటి ఒక్కొక్కభాగము హెచ్చుగ) గ్రహించి మెత్తగాచూర్ణించి వస్త్రగాలితము చేసి తేనెతో నూరి శనగగింజంత మొదలు కుంకుడుగింజంతవరకు మాత్రలుచేసి తుంగముస్తల కషాయముతో నివ్వవలెను. కృములు కృములవలన జనించిన వ్యాధులు అగ్ని



మాంద్యము హరించును. అగ్నిదీప్తినిచ్చును.

### —♦ కృమిఘాతినీగుటిక. ♦—

కావంచాలు పసుపు పిప్పళ్ళు కంపిల్లము గైరికము తెల్లతెగడవేరు కరక్కాయ మోదుగుమాడలు వీనిని సమభాగముగ గ్రహించి మంచినీళ్ళతో మర్దించి చిన్నంయెత్తు మాత్రలు చేయునది. ఓకిరెంత వికారము కడుపుబ్బరము శూల తుమ్ములు పీనస అన్నద్వేషము జ్వరము కృశత్వము వాంతి మలబద్ధము హరించును. కృములను నశింపచేయును.

### —♦ కృమిఫణి గరుడాస్త్రము. ♦—

ఆముదముతో వేయించిన గచ్చపప్పు మోదుగు మాడలు పిప్పలి బియ్యము నేపాలములు వేపగింజలు వీనిని సమముగ గ్రహించి తేనెతోనూరి శనగలంత మాత్రలుచేసి దేవదారు విడంగముల కషాయముతో యిచ్చిన క్రిములు చచ్చును.

### —♦ పథ్యములు. ♦—

పొట్లు, వేము, చక్రవర్తికూర, ముల్లంగిదుంపలు, పెసరకట్టు, ప్రాతవరిధాన్యము, విడంగములు.

### —♦ అపథ్యములు. ♦—

పాలు, మాంసము, బెల్లము, నేయి, పెరుగు, ఆకుకూర, మినుము, పులుసు, తీపివస్తువు.

జ్ఞాపిక:-చంటిపిల్లలకు కలిగియున్నట్టి క్రిమికార రోగములు ముందు బాలరోగచికిత్సాప్రకరణమున జూడుడు.

## అజీర్ణ ప్రకరణము.

### హుతాశనరసము.

రసము 1 తు॥ గంధకము 1 తు॥ పొంగించిన వెలిగారము 1 తు॥ నాభి 3 తు॥ కపర్ద 3 తు॥ శంఖభస్మము 3 తు॥ కరిధూపము 3 తు॥ మిర్యాలు 8 తు॥ వీనిని నిమ్మపండ్లతో 10 దినములు మర్దించి 1 మొదలు 4 గుంజలెత్తువరకు అల్లపురసము, తేనె, త్రికటుక కషాయము, వాము రసములతో నిచ్చిన అజీర్ణము పులితేన్పు కడుపుబ్బరము నశించును.

### మహాక్రవ్యాదరసము.

రసము 8 తు॥ గంధకం 16 తు॥ తామ్రము, పగడము, స్వర్ణము, కంచు, శంఖము, గవ్వ, ఖడ్గము, నాగ వంగములు వీనిభస్మములు అభ్రకము, మంచి ముత్యముల భస్మము, వైక్రాంతభస్మము, రజతభస్మము, కాంతసిందూరం, మండూరము యివి ప్రత్యేకము 4 తు॥ చేర్చి పంచకోల కషాయముతో 3 దినములు మర్దించి యీక్రిందిక్షారములను చేర్పవలెను క్షారములు:—నల్లేరు, చెరుకు, ఉత్తరేణు, అరటి, రేల చింత, మోదుగు, ములుగోరింట, కలబంద, మర్రియూడలు, గలిజేరు, వేప, తెల్లజిల్లేడు, జువ్వి, మారేడు, రేగు, చిత్రమూలము, బ్రహ్మదండి, నేలవు [illegible] వీని క్షారములను, ఒక్కొక్క తులము



చొ॥ కలుపవలెను. పిదప నిమ్మపండ్ల రసముతో 15 దినములు మర్దించి, పొంగించిన వెలిగారము తు 34లు, పంచలవణములు (సైంధవ, సౌవర్చల, బిడ, కాచ, సాముద్రలవణములు) అయిదును చేర్చి తు 12లు, మిర్యాలు తు 210 లు చేర్చి త్రిఫల కషాయము అల్లపురసము, మాదీఫలరసము, నారింజపండ్లరసము, వేముపండ్లరసము, శనగపులుసు అనుపానముతో ప్రత్యేకము 15 దినములు మర్దించి భద్రపరచవలెను. మోతాదు గుంజెత్తు మొదలు రెండు గుంజలవరకు. వాము రసముతో శూల, అల్లపురసముతో ఛర్ది, అరోచకము పొడిదగ్గు, వావిలిచిగుళ్ళ కషాయముతో జ్వరసహితమైన అజీర్ణము, పులిమజ్జిగతో గుర్వాహారజనితమగు ఆయాసము, అల్లపురసము తేనె పటికబెల్లము కలిపి కాచిన పానకముతో చిరకాలానుగత దీర్ఘాజీర్ణము, పొంగించిన లవంగాల రసముతో అగ్నిమాంద్యము పేగులఱచుట మొదలగు అనేక అజీర్ణవికారములు నశించును. మిగుల ప్రశస్తముగ వృద్ధవైద్య పరంపర యందు వాడుక చేయుచున్న యోగము. క్షారముల తయారుచేయు విధము:—క్షారములు తీయతగిన నల్లేరు మున్నగు పై వస్తువులను యెండించి కాల్చి మసిచేసి యాబూడిదను 6 రెట్లు నీళ్ళలో వేసి చక్కగా పిసికి ఒకరాత్రి నిల్వయుంచి ఉదయమున పై తేటనీరు

యినుప కళాయిలోనికి వడపోసికొని పూర్తిగా యిగిరి పోవువరకు గాచవలెను. ఇట్లుకాచిన కళాయియొక్క అడుగున తెల్లని ఉప్పుపట్టును. దానిని గీకి తీసికొనవలెను. ఇదియే క్షారములను తయారుచేయు విధము.

—♦ సూతాదిమాత్ర. ♦—

సూతభస్మము 4 తు॥ కాచు 6 తు॥ జాజికాయ 2 తు॥ గవ్వపలుకుసాంబ్రాణి రససిందూరము బాలింతపోలు యివి ప్రత్యేకము 1 తు॥ వీనిని బ్రాందితో మర్దించి శనగలంత మాత్రలను దాల్చినచెక్కరసము గసగసాల రసము మఱియూడల కషాయము ఇందు దేనితోనైన నిచ్చిన అజీర్ణ విరేచనములు ఆమదోషము నశించును.

—♦ హరీతక్యాదిచూర్ణము. ♦—

కరక్కాయ 32 తు॥ శొంఠి 16 తు॥ పిప్పళ్లు 8 తు॥ వాము 4 తు॥ జీలకర్ర 2 తు॥ సైంధవలవణము 1 తు॥ వీనిని మెత్తగచూర్ణించి వస్త్రగాలితముచేసి 1, 2, 3 చిన్నములవరకు తేనె పులిమజ్జిగతో యిచ్చేది. అజీర్ణము పులితేన్పు తగ్గును. ఆకలిపుట్టును.

—♦ భావనజీలకర్ర ♦—

జీలకర్ర 2 భా॥ ఉత్తరేణుక్షారము 1 భా॥ ఈరెంటిని గుచ్చెత్తి నిమ్మపండ్ల రసములో 7 దినములు భావనచేసి పూటకు అణాయెత్తు మొదలు బేడెత్తువరకు



సేవించుచుండల పులితేన్పులు కడుపుబ్బరము అజీర్ణము అన్నద్వేషము కడుపునొప్పి తగ్గును.

—♦ శతపుష్పాదిమాత్ర. ♦—

సదాపాకు 1/4 తు॥ మిర్యాలు 1/8 తు॥ సైంధవలవణము 1/4 తు॥ దానిమ్మరసముతో నూరి కుంకుడుగింజంత మాత్ర యిచ్చిన తేన్పువచ్చి అజీర్ణము తగ్గును.

—♦ బిల్వాదిమాత్ర. ♦—

మారేడువేరు తులసివెన్ను (పచ్చిది) కానుగ గింజలోనిపప్పు గంధతగరము దేవదారుచెక్క త్రిఫలములు త్రికటుకములు పసుపు మానుపసుపు వీనిని సమభాగముగ్రహించి గోమూత్రముతో మూడు దినములు మర్దించి సెనగలంత మొదలు కుంకుడు గింజలంతవరకు మాత్రలుచేసి భద్రపరచునది. వీనిని లోపలకుతినిన సకల అజీర్ణములు గ్రహణి అతిసారము కలరా తప్పక నశించును. మంచినీళ్ళతో మాత్రను అరగదీసి నస్యము చేయించి నేత్రములందంజనము గూడచేసి ఒకమాత్రను నరమూత్రముతోగాని పసుపురసముతోగాని లోపలకు తినిపించిన సర్ప విషము వృశ్చికము ఎలుక మున్నగు విషములు హరించును. అంజనము నస్యముచేసి మాత్రను తేలు కుట్టినచోట రాచి ఒకమాత్రను మంచినీళ్ళతో మింగించిన తేలు విషముతగ్గును. మతిభ్రాంతిమున దీనిని మిక్కి

లిగ వాడుదురు. దుర్లభమగు యోగరాజము.

—♦ భాస్కరలవణ చూర్ణము.

పిప్పళ్లు మోడి ధనియాలు నల్లజీలకర్ర సైంధవల వణము బిడాలవణము ఆకుపత్రి తాళీశపత్రి నాగకేస రాలు ఇవి ప్రత్యేకము 8 తు॥ సౌవర్చలవణము 20 తు॥ మిరియాలు తెల్లజీలకర్ర శొంఠి ఇవి ప్రత్యేకము 4 తు॥ దాల్చినపట్ట ఏలకులు యివి ప్రత్యేకము 12 తు॥ సముద్రలవణము 32 తు॥ దానిమ్మపండ్ల బెరడు 16 తు॥ పుల్లప్రబ్బలి 8 తు॥ వీనినెల్ల చూర్ణించి మజ్జిగ పెరుగుమీగడ తేట కాంజికము అను వానిలో దేనితోనైన సేవించిన సమస్తాజీర్ణములు నశించును. మరియు గ్రహణి మూలరోగము కుష్ఠము భగంద రము హృద్రోగము ఆమదోషము ప్లీహ అశ్మరి శ్వాసకాసలు క్రిమి పాండువు తగ్గును.

—♦ బృహదగ్నిముఖచూర్ణము. ♦—

యవక్షారము సర్జక్షారము చిత్రమూలము అగరు శొంఠి కానుగువేరుచెక్క సైంధవ, సౌవర్చ, బిడా, కాచ, సముద్రలవణములు పిన్నయేలకులు జాపత్రి గంటుభారంగి వాయింటగింజలు ఇంగువ పుష్కర మూలము కచ్చూరము మానుపసుపు తెల్లతెగడ తుంగముస్తలు వస కొడిశవిత్తులు ఉసిరిగపండు జీలకర్ర చింతపండు గజపిప్పలి పెద్దజీలకర్ర పుల్లప్రబ్బలి వాము



దేవదారుచెక్క కరక్కాయ అతివస నల్లతెగడ ప్రబ్బ రేలపండు సమభాగములు. నువ్వుచెట్టు మొక్కపు చెట్టు మునగ నీరుగొబ్బి మోదుగ వీనినికాల్చి చేసిన క్షారములు మండూరము అనునవియు ప్రత్యేకము ఒక భాగముచేర్చి చూర్ణించి మాదీఫల రసముతో 3 దినములును, శుక్తముతో 3 దినములును అల్లపురస ముతో 3 దినములును, భావనచేసి భోజనకాలమందు 2 తులముల మందును యిచ్చినయెడల అజీర్ణము గు ల్మము గుదరోగములు అగ్నిమాంద్యము నశించును.

—♦ అగ్నికుమారము. ♦—

రసము గంధకము పొంగించిన వెలిగారము ఇవి ఒక్కొక్క తులము నాభి గవ్వభస్మము శంఖభస్మ ము ఇవి ప్రత్యేకము 3 తు॥ మిరియాలు 8 తు॥ వీని ని నిమ్మపండ్లరసముతో మర్దించి మిరియపు గింజంత మాత్రలుచేసి వాడిన అజీర్ణమువలన గలిగిన వాంతు లు విరేచనములు తక్షణమున కట్టును. కడుపుబ్బర ము త్రేపులు మొదలగు వికారములణగును.

—♦ తామ్రభస్మయోగము. ♦—

తామ్రభస్మము పిప్పళ్ళు సమముగ చూర్ణించి తేనెతో సేవించిన క్లిష్టమైన అజీర్ణములు తగ్గును.

—♦ విషూచీచికిత్స. ♦—

ఇంగిలీకము రసకర్పూరము రససిందూరము జా

న్న గోరోచనము రోయపీత పావుదార శేవత్చెన్ని చిత్రమూలం పిప్పళ్ళు మిరియాలు వాంపువ్వు తాబేలు చేదు వీనిని సమభాగముగ మంచినీళ్ళతో మర్దించి కందిగింత మాత్రలుచేసి పొంగించిన యేలక్కాయల రసముతో యివ్వవలెను. తప్పక ఆరోగ్యము కలుగును.

### —♦ హింగ్వాదిమాత్ర. ♦—

కాశీయింగువ హారతికర్పూరము మృద్దారుశృంగి మిర్యాలు రససిందూరము రసకర్పూరము యివిప్రత్యేకము ఒకతులము, తాబేలుచేదులు రెండు, జున్ను గోరోచనము పావుదార రోయపీత కస్తూరి యివి ప్రత్యేకము పావుతులము, బాలింతపోలు ఒకతు॥ వీనిని కరివేపాకురసముతో 5 దినములు మర్దించి సెనగలంత మాత్రలుచేసి నీడను ఆరబెట్టి భద్రపరచునది.

అనుపానం—ఉష్ణోదకముతో తొక్కతీసిన యాలక్కాయలరసం తులము. కలరా కట్టుటకు ఒక్క మాత్రయేచాలును. ఈమాత్రలు పలుమారు అనేక రోగులపై నుపయోగింపబడి నూటికి నూరు మందికిని ప్రాణదానమునొసంగినవి సక్రమముగ యీమాత్రలనుచేసి వైద్యులు సత్కీర్తి వడయుదురుగాక!

### —♦ మరియొక యోగము. ♦—

రససిందూరము రసకర్పూరము హారతికర్పూరము



జున్ను గోరోచనము పావుదార రోయపీత తాబేలు చేదు మిరియాలు పిప్పళ్లు గసగసాలు దాల్చినచెక్క ఇంగిలీకము నల్లమందు వీనిని సమభాగముగ మర్దించి సెనగలంత మాత్రలుచేసి పొంగించిన యేలక్కాయల రసముతో యిచ్చేది.

జ్ఞాపిక:—ఈమందును 1, 2 విరేచనములైన పిదప వైద్యుని వద్దకు వచ్చునెడల వాడునది. పైయోగములు వ్యాధి అంకురించిన వెంటనే వాడవగినవి.

### —♦ 4 వ యోగము. ♦—

నల్లమందు మిరపగింజలు దాల్చినచక్క హారతికర్పూరము వాంపువ్వు రసకర్పూరము ఇంగిలీకము వీనిని వేపచక్కరసముతో మర్దించి కందిగింజంతమాత్రలుచేసి అనుపానవిశేషములతో వాడవలెను.

### —♦ అజీర్ణమున పథ్యములు. ♦—

వ్యాయామము పెసలు పేలాలమండము జింక నెమలి కుందేలు సన్నజాతి మత్స్యములు వీనిమాంసములు గోలుగుకూర చక్రవర్తికూర వెల్లుల్లి మునగకాయ పొట్లకాయ లేతవంకాయ కాకరకాయ అల్లము ఉశిరికాయ కానుగ శొంఠి దానిమ్మపండు నిమ్మపండు మాదీఫలము తేనె మజ్జిగ కలి యింగువ లవణము నూనె నెయ్యి వాము మిరియాలు కాచిననీరు.

—♦ అపథ్యములు. ♦—

మలమూత్రనిరోధము అమితభోజనము రాత్రిజాగరణము పగటినిద్ర బచ్చలికూర సెనగలు మినుములు నేరేడు కలువదుంపలు జున్ను విరిగినపాలు.

## శూలప్రకరణము.

—♦ శూలకుఠారరసము. ♦—

రస గంధకములు వెలిగారము త్రిఫలములు త్రికటుకములు తాళకము నాభి తామ్రభస్మము నేపాళములు వీనిని గుంటకలగరరసముతో మర్దించి గుంజెత్తు మాత్రలజేసి అల్లపురసముతో నిచ్చిన శూలతగ్గును.

—♦ కుబేరాక్షాదిచూర్ణము. ♦—

వేయించిన గచ్చపలుకు ఇంగువ వెలిగారము సైంధవలవణము మాదీఫలము మిరియాలు శొంఠి వాము కరక్కాయ పిప్పళ్ళు వీనిని క్రమవృద్ధిగ (మొదటిది 1 భా॥ రెండవది 2 భా॥ మూడవది 3 భా॥ చొ॥) గ్రహించి చూర్ణించి ఉష్ణోదకముతో అణా యెత్తు మొదలు 4 అణాల యెత్తువరకు సేవించిన సమస్తశూలలు నివర్తించును.

—♦ శూలగజాంకుశరసము. ♦—

రసము 3 భా॥ వెలిగారం 2 భా॥ గంధకము 5 భా॥ ముస్తలు 1 భా॥ నేపాళములు 4 భా॥ నువ్వుచెట్టుక్షారం 18 భా॥ తామ్రభస్మం 4 భా॥ చింత



బెరడుక్షారము 9 భా॥ మోదుగుక్షారం 9 భా॥ చిత్రమూలక్షారము 9 భా॥ త్రికటుకములు సైంధవలవణము యవక్షారము ఇవిప్రత్యేకము 2 భా॥ బిడాలవణము సౌవర్చలవణము కాచలవణము సముద్రలవణము పిప్పళ్ళు ఇవి ప్రత్యేకము 3 భా॥ సెనగక్షారము 7 భా॥ వీనినెల్ల చిత్రమూలరసముతో మర్దించి రెండుగుంజలంత మాత్రలుచేసి అల్లపురసముతో సేవించిన పంచగుల్మములు అష్ఠీల ప్లీహ అష్టవిధశూలలు ప్రత్యష్ఠీల తూనీ ప్రతితూనులు ఉదరము శోఫ పాండువు నశించును,

—♦ మహాశంఖవటి. ♦—

చింతబెరళ్ళ క్షారము 5 తు॥ ఉప్పు సైంధవ సౌవర్చ బిడలవణములు వెలిగారము యివి ప్రత్యేకము తు॥ 1 వీనిని 32 తులముల నిమ్మపండ్లరసములోవేసి కలిపి అందు 10 తు॥ ల శంఖమును కాల్చి చేర్చి మరియు ఇంగువ త్రికటుకములు గంధకము యివిప్రత్యేకమొకతులము రసము $\frac{1}{2}$ తు॥ నాభి $\frac{1}{3}$ తు॥ వీనిని చూర్ణించి కలిపి నిమ్మపండ్ల రసముతో 3 దినములు మర్దించి కుంకుడుగింజలంత మాత్రలు చేసి ఉష్ణోదకము పులిమజ్జిగ వామురసము అనుపానిలో దేనితోనైన రోజునకు రెండుమూడుమాత్ర లుపయోగించుచున్న శూల అజీర్ణము పరిణామశూలనివర్తించును.

## నారికేళఖండము.

కొబ్బరికోరు 8 పలములు శర్కర 64 తు॥ నేయి 20 తు॥ శొంఠి 16 తు॥ పాలు 32 తు॥ వీని నేకముచేసి మందాగ్నిచే పాకముచేసి దించి తవక్షీరి త్రికటుకములు తుంగముస్తలు చాతుర్జాతకములు ధనియాలు గజపిప్పళ్లు పిప్పళ్ళు జీలకర్ర ఇవి ప్రత్యేకము 2 తు॥ చూర్ణించి అందుచేర్చి దానిని భద్రపరచుకొని దినమునకు పావలాయెత్తు వో॥ సేవించుచున్న శూలలు ఆమవాతము పరిణామశూల అమ్లపైత్యము హరించును, బలము అగ్నిదీప్తి వీర్యవృద్ధికలుగును.

## దీప్యకాదిచూర్ణము.

వాము సైంధవలవణము కరకక్కాయ శొంఠి వీనిని సమభాగముగ చూర్ణించి సేవించిన సర్వశూలలు హరించి అగ్నిదీప్తికలుగును.

## శంఖాదిచూర్ణము.

శంఖభస్మము సైంధవలవణము ఇంగువ త్రికటుకములు వీనిని చూర్ణించి వేడినీటితో సేవించిన శూల హరించును.

## హరీతక్యాదియోగము.

లోహభస్మము కరకక్కాయ చూర్ణము మూరెం మును సమముగ కలిపి గోమూత్రముతో ఉడికించి యెండించి దానికిసమం బెల్లమున్ను కలిపి బలానుసార



ముగుమాత్రను సేవించిన సర్వశూలలు శమించును.

## పథ్యములు.

ఉలవకట్టు చక్రపత్తికూర ములక పొట్లకాయ గలిజేరు ముదురు గుమ్మడికాయ ఇంగువ జీలకర్ర అవుమజ్జిగ, నాదదబ్బకాయ, మారేడుపండు.

## అపథ్యములు.

నేపపండు కొతిమెర్లు అనుములు దుంపలు పిండివంటకములు తెలకపిండి నవీనమాంసము అనపకాయ పెరుగు పులుసు కఠినముగ జీర్ణించు ఇతర వస్తువులు.

# ఛర్దిప్రకరణము.

## పూర్ణచంద్రరసము.

రసము, గంధకము వీనిని సమభాగముగ వెలగవేళ్ళరసముతో 3 దినములు మర్దించి మాత్రలుచేసి గాజుకుప్పెలోబోసి వాలుకాయంత్రమున 12 జాములునుండి సిందూరమును మరల వెలగవేళ్ళ రసముతో 3 దినములును, మారేడువేళ్ళ రసముతో 3 ది॥ మర్దించి యీసిందూరమునకు సమముగ ఏలకులు, దాల్చినచక్క, జాపత్రి, నాగకేసరములు, పచ్చకర్పూరము, లవంగములు అనువాని చూర్ణమునుచేర్చి గుంజాప్రమాణము మొదలు 8 గుంజలవరకు పేలపుసత్తుపంచదార తేనె వీనిలో దేనితోనైన సేవించిన వలచ

ఛర్దులు శ్వాస కాసలు అరుచి హృద్రోగము స్వర భంగము మందాగ్ని నశించును.

—♦ ఊషణాదిచూర్ణము. ♦—

పిప్పలి, వెలగపండ్లగుంజు, తుంగముస్తలు, దాల్చినచక్క, ఏలకులు, ఆకుపత్రి, సింధూరము వీనిని చూర్ణించి తేనెతో పుచ్చుకొన్న వాంతులుకట్టును.

—♦ ఖండార్ద్రిక లేహ్యము. ♦—

పైపొట్టుతీసిన అల్లపు తునకలు 16 పలములను, 12 పలముల ఆవునేతిలోవేసి దోరగావేయించి అందు మిరియపు చూర్ణము 12 నిష్కములు, పిప్పలీ చూర్ణము 8 నిష్కములు, మోడి 4 ని॥ వెదురుప్పు జాజికాయ, ఏలకులు, శొంఠి ఇవి ప్రత్యేకము 4 ని॥ చిత్రమూలచూర్ణము 10 ని॥ పంచదార 16 ప॥ వీనినెల్ల చేర్చి లేహ్యపాకముగ వండి ప్రాతఃకాలమున తులప్రమాణమగు లేహ్యమును సేవించుచున్న యెడల ఛర్ది అరోచకము అగ్నిమాంద్యము ఆమ్లపిత్తము నశించును. పాచనదీపనముల గలిగించును.

—♦ నిమ్మపండు మురబ్బా. ♦—

రెండుశేర్లు ఉప్పును మూడుశేర్ల నీళ్ళలోవేసి బాగుగాకరుగనిచ్చి అందు 20 నిమ్మపండ్లను వేసి వారముదినములు నానబెట్టి తీసి మంచినీళ్ళలోవేసి ఉడకబెట్టి నీరు పారబోయవలెను యిట్లు మూడుసారులు



మంచినీళ్ళతో ఉడకబెట్టి యాకాయలను తీసికొని కాయలకు సమముగ పంచదార ఒక మంటిపాత్రలో వేసి కాయలనుగూడ పంచదారలోవేసి కాచవలెను. కాయలోని రసమువలన పంచదార కరిగి పాకమగును. లేతపాకమునదింపి గాజుజాడీలో భద్రపరచుకొని ప్రతియుదయమునను అరతులము మొదలు తులమువరకు తినుచున్న వాంతి ఓకిరింత అన్నద్వేషము గర్భిణీస్త్రీలవేవిళ్ళు వికారము తలత్రిప్పు కడుపులోమంట మొదలగు పిత్తవికారము లన్నియు శమించును. రుచిబుట్టించును. దారుణమగు ఛర్దిని ఆపుచేయును.

—♦ సూర్యనారాయణ లేహ్యం. ♦—

శొంఠి మిర్యాలు వాము సోపు చిత్రమూలము యివిప్రత్యేక మొకతులము నారింజపండ్ల పైనతొక్కలు తు 5 లు సైంధవలవణము తు 2 లు వీనిని మెత్తగచూర్ణించి ఒక పింగాణీలో నుంచి నిమ్మపండ్ల రసముతో 21 దినములు భావనచేసి యుంచుకొనవలెను. మోతాదు:—పావుతులం మొదలు తులం వరకు. గుణము:—అజీర్ణము, ఛర్ది, త్రేనుపు మొదలగు పిత్తవికారములు తక్షణమే తగ్గును.

—♦ పంచలవణమైసము. ♦—

త్రికటుకములు కలసి 1½ తు॥ త్రిఫలములు కలసి 1½ తు॥ సైంధవ, సౌవర్చల, కాచ, సాముద్రలవణ

ములు నాల్గును కలసి 2 తు॥ వలందు యింగిలీకము 1½ తు॥ రససిందూరము అరతులము వీనిని మెత్తగ చూర్ణించి నిమ్మపండ్ల రసము సెనగపులుసు అల్లపు రసము అనువానిలో ప్రత్యేకము 3 దినములు భావనచేసి మూకుడులో పోసి తగుమాత్రము తేనెపోసి ఉడకబెట్టి చిక్కబడిన తరువాత దించి గాజు సీసాలో భద్రపరచి చిన్నంమొదలు రెండుచిన్నములవరకు పులిపజ్జిగ అల్లపురసము వాముర సము అనువానిలో దేనితోనైనను ప్రత్యేకముగనైనను సేవించిన ప్రవాహమువంటి వాంతినైనను ఆపుచేయును. అజీర్ణము తగ్గును. అన్నహితము కలిగించును. గుర్వాహారము ను తక్షణమే జీర్ణింపచేయును. శూలలను పోగొట్టును.

## —♦ పైత్యాంతకరసము. ♦—

జీలకర్ర 2 భా॥ ధనియాలు 3 భా॥ రససిందూరం 4 భా॥ ఇంగిలీకము 5 భా॥ అల్లము 12 భా॥ శొంఠి 6 భా॥ సైంధవము 4 భా॥ నిమ్మపండ్ల రసముతో నెల దినములు భావనచేసి 2 మొదలు 6 గుం॥ వరకు సేవించిన పిత్తము ఛర్ది అజీర్ణము నశించును.

## —♦ మహాపైత్యాంతక రసము. ♦—

స్వర్ణభస్మము 1 భాగము, రజతభస్మము 2 భా॥ ముత్యభస్మము 3 భా॥ అభ్రిక సిందూరం 4 భా॥ రససిందూరం 5 భా॥ శొంఠి 6 భా॥ అల్లము మాదీ



ఫలము జీలకర్ర అల్లము దానిమ్మపండ్లు శనగపులుసు ఆమ్లవేతసము వీని రసములతో ప్రత్యేకము 7 దినములు మర్దించి గుంజమొదలు 2 గుంజలయెత్తు వరకు యుక్తమగు అనుపానములతో 40 విధములగు పిత్త రోగములందును వాడనగును.

## —♦ స్వర్ణసూర్యావర్తి. ♦—

బంగారు భస్మము తు 1 అభ్రకం తు 2 కాకిదొండ విత్తులలోనిపప్పు పైడిప్రత్తి గింజలలోని పప్పు పొంగించిన వెలిగారము, లవంగాలు, తిప్పసత్తు, శొంఠి, యాలకికాయలగింజలు, నాగకేసరాలు యివి ప్రత్యేకము తు 4 అన్నిటికి సమం శుద్ధిచేసిన యింగిలీకము వీనిని అల్లపురసము నిమ్మపండ్లరసము మాదీఫలరసము అనువానితో ప్రత్యేకము 7 దినములు మర్దించవలెను. మోతాదు:—2 గురివెందల యెత్తు పిత్తతాపము మేహజ్వరము తలనొప్పి ఛర్ది గొంతుకలో ఉండపెట్టినట్లుండుట త్రిప్పు తలదిమ్ము కండ్లు తిరుగుట కడుపులో మంట పులితేన్పులు తగ్గును.

## —♦ మహాబిల్వాది లేహ్యము. ♦—

మారేడువేరుపట్ట 400 తు॥ తామరతూడు 200 తు॥ వీనిని నలియగొట్టి 1024 తులముల నీటిలోవేసి 8 వ వంతు మిగులునట్లు కాచి వడియగట్టిన కషా

యనునది అల్లపురసము 64 తు॥ దానిమ్మపండ్ల రసము 32 తు॥ పైడిప్రత్తికాయల రసము వెలగపండ్ల గుజ్జు ప్రత్యేకము 32 తు॥ పంచదార 200 తు॥ చేర్చి కుండలో పక్వముచేయుచు లవంగపట్ట ఏలకులు జాపత్రి త్రికటుకములు ధనియాలు తుంగముస్తలు వాము తెల్లజీలకర్ర నల్లజీలకర్ర సైంధవలవణము యష్టిమధుకము లోహభస్మము యివి ప్రత్యేకము 4 తు॥ చూర్ణించిచేర్చి పిదప ఆవునేయి 8 తు॥ తేనె 16 తు॥ కలిపి లేహ్యపాకమున దింపి నేతితో మాగిన కుండయందుంచి ధాన్యరాశి యందు 15 దినములుగాని మాసముగాని నిల్వయుంచి అనుపాన విశేషములతో అర్ధతులము మొదలు తులము వరకు సేవించిన ఛర్ది యెక్కిళ్లు ఊర్ధ్వవాతము అజీర్ణము అరోచకము ఆధ్మానము హృదయశూల మొదలగు సకల పిత్తరోగములను నశింపచేయుటయే గాక వీర్యవృద్ధి బలము ఆయువు ఆరోగ్యము కాంతి కలుగజేయును.

—♦ లఘుయోగము. ♦—

పుదీనాపూవు వాముపూవు హారతికర్పూరము మూడు సమభాగములుగ గాజుసీసాలోవేసిన నీరుగ నగును. పంచదారలో 1 మొదలు 3 చుక్కల వరకు వేసి యిచ్చిన వాంతులు కట్టును.

 

—♦ పర్పటకక్వాథము. ♦—

పర్పాటక కషాయమున తేనెజేర్చి యిచ్చిన వాంతులు కట్టును.

—♦ అశ్వత్థత్వగోదకము. ♦—

రావిచెక్క కాల్చినమసిని నీళ్ళలోకలిపి, తేరనిచ్చి యానీటిని ద్రాగించిన ఛర్ది హరించును.

—♦ ఛర్ద్యరోచకములకు కణాదిచూర్ణము. ♦—

పిప్పళ్లు వెలగపండు పేలాలు మిరియాలు వీనిని సమభాగముగ చూర్ణించి తేనెతో సేవించిన ఛర్ది అరోచకము శమించును.

—♦ అభయాది. ♦—

కరక్కాయ త్రికటుకములు ధనియాలు జీలకర్ర వీనిని సమముగ చూర్ణించి తేనెతో సేవించిన ఛర్ది అరోచకము తగ్గును.

—♦ మయూరపింఛము. ♦—

నెమలి యీకలు, తెల్లపట్టువస్త్రము వీనిని కాల్చినబూడిదలో సమముగ పైడిపత్తి విత్తులలోనిపప్పునుచేర్చి తేనె కలిపి సేవించిన ఛర్ది నివర్తించును.

—♦ పిత్తాతిరేకమందు పథ్యములు. ♦—

పాతవడ్లు పొట్లకాయ గోధుమలు చిర్రికూర ఉశిరికపప్పు పొన్నగంటి వాతరాసికూర ద్రాక్ష దానిమ్మపండు శ్రీగంధము.

—◆ అపథ్యములు. ◆—

పెరుగు పాలు బెల్లము నేయి మినుములు అనుములు ఆవాలు విదాహమును పుట్టించు వస్తువులు సంచారము కోపము ఉష్ణసేవ ఎండతిరుగుట.

## హిక్కా ప్రకరణము.

—◆ కంటకార్యాది ◆—

ఉశిరిగకాయలంత వాకుడువేళ్ళ ముద్దలో పొంగించిన యింగువ పిప్పళ్ళు అను వానిచూర్ణమును చేర్చి తేనెతో పుచ్చుకొన్నచో శ్వాస ఎక్కిళ్లు నివర్తించును.

—◆ విభీతకాదికషాయము. ◆—

తానికాయ ముస్తలు ఉశిరిగపప్పు శొంఠి గంటుభారంగి పిప్పళ్ళు కరకాయలు వీనిని సమభాగముగ గ్రహించి కషాయము గాచి, సేవించిన వాతము శ్వాస ఎక్కిళ్ళు వాంతి కాస నశించును.

—◆ టంకణాదిచూర్ణము. ◆—

వెలిగారము ఆకుపత్రి దాల్చినచెక్క చంగల్వకోష్టు యేలకులు వీనిని సమభాగముగ చూర్ణించి తేనెతో సేవించిన ఎక్కిళ్ళు శమించును.

—◆ హిక్కలకు యోగాంతరములు. ◆—

ఎండ్రకాయ కలుగులోని నీరు, యష్టిమధుకము నెమలియీకల భస్మము వీనిలో దేనినైన తేనెచేర్చి యిచ్చిన ఎక్కిళ్ళు నశించును. వెలగాకు రసమును



తేనెకలిపి యిచ్చినచో హిక్కను ఆపివేయును.

—◆ అనుభూతప్రక్రియ. ◆—

నవాసాగరమును మంచినీటిచుక్క వేసి మెత్తగా నూరి కుంకుడుగింజంత మాత్ర మంచినీళ్ళతో యిచ్చినయెడల ఒక్కనిముషములో ఎక్కిళ్లు ఆగును.

—◆ ధూమము. ◆—

ఆవుకొమ్ము పాముకుబుసము నెమలి యీకలు గుగ్గిలము పసుపు శ్రీగంధము కృష్ణాగురు వీనిని ఆవునేతితో తడిపి పొగవేసి యాపొగ నాఘ్రాణించిన హిక్కలు నశించును.

—◆ పథ్యములు. ◆—

కపోతములు, త్రికటుకములు, పుష్కరమూలము, మాదీఫలము, పుల్లప్రబ్బలి, 60 దినములకు పండు ధాన్యము, గోధుమలు, యవలు, పెసలు, ఉలవలు నిద్ర ఇవి పథ్యములు.

—◆ అపథ్యములు. ◆—

మలబంధకర ద్రవ్యములు, వెమరుమొలక, మద్యము, విదాహివస్తువులు, అనుములు, మినుములు తెలకపిండి, ఆవాలు, పులుసు, శీతలాన్నపానములు

## శ్వాసప్రకరణము.

—◆ చ్యవనప్రాశరసాయనము. ◆—

[illegible] తక్కెడ పాలగుమ్ముడు మూరేడు [illegible]

దుంధిల్లము పల్లేరు వీనిపేళ్లు కోలపొన్న నక్కతోక పొన్న వాకుడువేళ్లు తెల్లములకవేళ్లు పిప్పళ్లు కర్కాటకశృంగి ద్రాక్షపండు తిప్పతీగ కరక్కాయ చిన్న ముత్తవపులగము నేలయుసిరిక అడ్డసరము వేరు బుద్ధి వృద్ధి జీవంతి (పాలకూర) కచోరము జీవకము ఋషభకము తుంగముస్తలు పుష్కరమూలము కాకిదొండవిత్తులు అడవిపెసర అడవిమినుము నేలగుమ్ముడు గలిజేరు కాకోళి క్షీరకాకోళి శతావరిపూవులు పెద్ద మహామేద పలుకులు కృష్ణాగురు చందనము వీనిని ప్రత్యేకము 8 తు॥ చొ॥ గ్రహించి నలియగొట్టి ఒక పెద్దభాండమందువేసి అందు విక్కిలి పెద్దవియు పురుగు చీడ పట్టనివియునగు చైత్రా మలకములను 500 లెక్కించి గుడ్డను వదులుగ మూటకట్టివేసి 4096 తులముల నీరుపోసి 8 వ భాగము గాని, 16 వ భాగముగాని మిగులునట్లు గాచి ఉసిరికాయల మూటతీసి ఆరబోయవలెను. పిదప కషాయమును వడియగట్టి అందు 100 తు॥ చక్కెర చేర్చి పాకము పట్టుచు ఆరబోసిన ఉశిరిగపండ్లలోని గింజలను ఊట్లను తీసి పారవైచి మెత్తనిగుంజుతో 8 పలములు నేతిని, 8 పలముల నూనెను కలిపి దోరగా వేయించి పై పాకమునవేసి కలియ గలుపవలెను. పిదప అందు [illegible]చూర్ణము 8 తు॥ తవక్షీర 16 తు॥ దాల్చినపట్ట



పలుకులు లవంగపత్రి నాగకేసరములు ఇవి ప్రత్యేకము 12 అణాలయెత్తు చూర్ణించి చేర్చి పక్వమైన పిదప దించి చల్లారిన తరువాత 24 తులముల తేనె చేర్చి కలియగలిపి ఒక భాండమున భద్రపరచి 1 సంవత్సరము గడచిన తరువాత బలానుసారముగ సేవించిన క్షీణత్వము శ్వాసకాసలు దప్పి వాతరక్తము ఉరోగ్రహము వాతపిత్తవికారములు శుక్రదోషములు మూత్రదోషములు నశించును. బాలురు వృద్ధులు క్షీణించినవారు అధికసంభోగము వలన శుష్కక్షయమైనవారు దీనిని సేవించిన మంచి ఆరోగ్యము బలము వర్ణము చిరాయువు కలుగును. ప్రసిద్ధమైనది.

### —♦ పూర్ణచంద్రోదయము. ♦—

అపరంజి 1 తు॥ పాదరసము 8 తు॥ ఖల్వమందుంచి మర్దించి పిదప 16 తు॥ గంధకమును చేర్చి పైడిపత్తిపూల రసముతోను కలబంద రసముతోను ఒక్కొక్క దినం మర్దించి గాజుకుప్పెలో బోసి వాలుకాయంత్రమున 3 దినములు వండి స్వాంగశీతలమున సిందూరమును గ్రహించి దానితో పచ్చకర్పూరము జాజికాయ పిప్పళ్ళు లవంగాలు వీనిని ప్రత్యేకము 1 తు॥ చొ॥ కస్తూరి 4 అణాలయెత్తు కలిపి మంచితీర్థముతో మర్దించి మాత్రలు చేసికొనునది.

## మకరధ్వజ.

అవరంజి 4 తు॥ రసం 8 తు॥ గంధకం 16 తు॥ వీనిని యెఱ్ఱప్రత్తిపూలరసము తెల్ల ఊడుగపండ్లరసము కలబందరసము అనువానితో మర్దించి వాలుకాయంత్రమున వండి సిందూరమును గ్రహించి మరల 32 పలముల గంధకమును జేర్చి నూరి మరల వాలుకా యంత్రమున వండి సాంగశీతలమున సిందూరమును గ్రహించవలెను. మోతాదు:—గుంజెత్తు.

## సిద్ధమకరధ్వజ.

సువర్ణము 8 తు॥ రసము 64 తు॥ గంధకము 128 తు॥ వీనిని కలుబందరసముతో మర్దించి వాలుకాయంత్రమున 2 దినములు వండి సాంగశీతలమున దీసి యందలి సిందూరముతో 128 తు॥ గంధకము చేర్చి వాలుకాయంత్రమున వండి మరల సిందూరముతో 128 తు॥ గంధకమును చేర్చి వాలుకాయంత్రమున వండి సిందూరమును గ్రహించునది. దీనినే స్వర్ణఘటిత షడ్గుణ బలిజారిత మకరధ్వజ మందురు.

## ఉపయోగించువిధము.

యేలకిగింజలు జాజికాయ జాపత్రి లవంగాలు గంజాయి పచ్చకర్పూరము కుంకుమపూవు సాలామిశ్రి యివి ప్రత్యేక మొక బేడెత్తు సల్లమందు అణాయెత్తు సిద్ధమకరధ్వజ అరతులము వీనిని పన్నీరుతో



గాని చందన కషాయముతోగాని, తమలపాకు రసముతోగాని మర్దించి ఒక చిన్నము కస్తూరిచేర్చి కలియనూరి 60 మాత్రలు లేక 50 మాత్రలచేసి ఉదయ సాయంకాలములందు ఆవుపాలు పంచదార అనుపానముతో సేవించుచుండిన శుక్రదౌర్బల్యము, శీఘ్రస్ఖలనము, వీర్యము పలచబడుట, నీరసము, సంభోగ మధ్యమున పురుషావయవము సోలిపోవుట మొదలగు బాధలు నిశ్చయముగ తగ్గును.

గోమూత్ర శిలాజితు తిప్పసత్తు శొంఠి కళింగరాస్నము వీనిని ఔషధమునకు 4 రెట్లు చేర్చి చెరకురసముతోగాని తేనెతోగాని నూరి చిన్నం మాత్రలు చేసి దినమునకు 2 చొ॥ మంచినీళ్ళతో సేవించునెడల కాళ్ళతీత నడుమునందు పటుత్వము లేక నొప్పి కలుగుట సంభోగముజరిగిననాటి యుదయమున సులభముగ శయ్యనుండి లేవలేకపోవుట అమిత బద్ధకము యివి తగ్గును.

జాజికాయ లవంగములు పచ్చకర్పూరము మిర్యాలు యివి ప్రత్యేకము ఒకతులము స్వర్ణభస్మము బేడెత్తు కస్తూరి బేడెత్తు వీనికన్నిటికి సమము సిద్ధమకరధ్వజరసము వీనిని చందన కషాయముతో మర్దించి 2 మొదలు 4 గురివెందల యెత్తువరకు మాత్రలుచేసి దినమునకు 2 చొ॥ సేవించుచుండిన అమిత వీర్యవృద్ధి

కలుగును. జీర్ణజ్వరము సాంతముగ నశించును. రక్తము శుద్ధమగును. కాంతి బలము పుష్టి పెంపొందును.

లవంగాలు చందనము కస్తూరి కుంకుమపువ్వు సిద్ధమకరధ్వజము వీనిని సమభాగములుగ స్వీకరించి తేనెతో మర్దించి వల్లగింజయెత్తు మాత్రలుచేసి బలానుసారముగ నుపయోగించుచుండిన అత్యద్భుతమగు బలవీర్య పుష్టి కాంతులు కలుగును. క్షయాది సకల రోగములందును. అమోఘముగ పనిచేయును. మఱియు,

సిద్ధమకరధ్వజమును మెత్తగనూరి తేనెతో అమితమై ఛర్ది హిక్కలకు తమలపాకు రసముతో చిరకాలపు దగ్గులకు తిప్పసత్తుతో అత్యుష్ణతకు దానిమ్మ రసముతో రక్తహీనతకు అడ్డసరపుఆకు కషాయముతో శ్వాసకు ఇండుపగింజ (చిల్లగింజ) ల కషాయముతో ధాతునష్టమునకు యివ్వవచ్చును. యిట్టి యుత్తమ ఔషధమును బుద్ధిమంతులగు వైద్యులు అనుపాన విశేషములచే సకల రోగములందును వాడుదురు.

ఈ అనుపానములు పూర్ణచంద్రోదయ మకరధ్వజ సిద్ధమకరధ్వజలకు 3 టికి ఉపయోగించును. 3 న్ను ఇంచుమించు సమానగుణములు కలవి.



## కనకబాలసూర్యోదయము.

రసము గంధకము తాళకం వెలిగారం నవాసాగరం సువర్ణము అభ్రకం రజతం తామ్రము ప్రవాళం లోహం వంగం సమముగ వీనిని జల్లెడు చిత్రమూలం అల్లము వీని రసములతో 3 దినములు నూరి వాలుకాయంత్రమున 6 జాములు వండి పై రసములచే మర్దించి కుప్పెలు కట్టేది తేనెతో క్షయ సుగంధికషాయముతో రక్తక్షీణత త్రిఫల కషాయముతో పాండు కామిల ఉబ్బులు పటికిబెల్లముతో వాడదగు అల్లపురసము తేనెతో అరుచి మున్నగు వ్యాధులు నివర్తించును. ప్రసిద్ధయోగము.

## రసభూపతి.

రసగంధకములు తామ్రభస్మము నాభి వీనిని సమభాగములుగ గ్రహించి హంసపాది రసముతో మర్దించి వాలుకా యంత్రమున 12 జాములు వండి తీసి ఔషధములో 4 వ వంతు నాభి, నాభికి సగము మిరియపుచూర్ణము కలిపి హంసపాదిరసమున మర్దించి గుంజెత్తు మాత్రలుచేసి తమలపాకు రసముతో వాడిన క్షయ పాండు కామిల శూల పాతము వాంతి జ్వరము సన్నిపాతము హరించును.

## తాళకభస్మము.

శుద్ధిచేసిన పత్రతాళకమును వెంపలియాకు రస్స

కసివెంద్రాకు నేలయుసిరిగఆకు ఉత్తరేణియాకు రసము
లతో ప్రత్యేక మొకదినము మర్దించి బిళ్ళచేసి ఘుం
డించుకొనవలెను. పిదప మోదుగుచెక్క బూడిదను
సంపాదించి దానిని ఆవునేతితో కలిపి పిడికెట నొక్క
నచో ముద్దయగునంత నేతిని కలిపి ఆబూడిద మధ్య
పై తాళకపు బిళ్ళనుపెట్టి శరావసంపుటమును సంధి
బంధముచేసి 8 జాములు క్రమాగ్నులతో వండ
వలెను. స్వాంగశీతలమున తెల్లగ భస్మమైయుండు
తాళకమును గ్రహించి వడ్లగింజయెత్తు చొ॥ తేనె లేక
వెన్న అనుపానముతో నుపయోగించిన కఠినమైన
క్షయాదిరోగములును శ్వాస కాసలును చర్మరోగము
లును సుఖవ్యాధులును తప్పక నివర్తించును.

## —♦ త్రైలోక్యచింతామణి. ♦—

రసము, వజ్రము, రజతము, తామ్రము, లోహ
ము, అభ్రకము, గంధకము, ముత్యము, పగడము,
శంఖము, తాళకము, మణిశిల ఇవి ప్రత్యేకము 6
తు॥ చొ॥ గ్రహించి చిత్రమూలము అడవికంద నా
విలి బ్రహ్మచెముడు వీని రసముతో ప్రత్యేకము 1 ది
నము నూరి ఆమందును పచ్చగవ్వలలో కూరి మూ
తులకు జిల్లేడు పాలతో నూరిన వెలిగారమును రాచి
మూసి యెండించి పుటముచేసి తీసి గవ్వలలోని మం
దును కల్వములోనుంచి అందు 30 తు॥ రసభస్మము



20 తు॥ వైక్రాంతభస్మము చేర్చి మూగచెక్క చి
త్రమూలము అల్లము గంజాయిఆకు నిమ్మపండ్లు
మాదీఫలం వీని రసములతో క్రమముగా 7, 20, 8,
3, 7 దినములు మర్దించి పిదప పొంగించిన వెలిగా
రము 50 తు॥ వత్సనాభి 12 తు॥ మిరియాలు 12
తు॥ లవంగాలు 3 తు॥ శొంఠి 3 తు॥ కరక్కాయ
నలుపు 3 తు॥ పిప్పళ్లు 3 తు॥ జాజికాయ 3 తు॥
చేర్చి నిమ్మకాయ అల్లముఅనుపానరసములతో నాల
దినములు మర్దించి కుప్పెలుకట్టెది. అనుపానవిశేష
ములతో వాడిన క్షయ శ్వాసకాసలు సన్నిపాతము
మొదలగు రోగములు నివర్తించును.

## —♦ కాస్తవల్లభరసము. ♦—

కాంతలోహము 16 భా॥ ఖడ్గలోహం 14 భా॥
మండూరం 12 భా॥ వెలిగారం 10 భా॥ రక్తమణి
శిల 8 భా॥ కర్పూరశిలాజితు 16 భా॥ రసము 66
భా॥ గంధకము 132 భా॥ వీనిని మంచికొర్ధనుతో
నూరి మాత్రలుచేసి వాలుకా యంత్రమున 7 దిన
ములువండి స్వాంగశీతలమునదీసి భద్రపరచి బలాను
సారముపయోగించిన క్షయ పాండువు శ్వాసకాసలు
శోఫ మొదలగు వ్యాధులు నివర్తించును.

## కాసప్రకరణము.

### —♦ వాసావలేహ్యము. ♦—

ఆడసరపుఆకుల కషాయము 64 తు॥ పంచదార 32 తు॥ వీనినిచేర్చి పాకముపట్టి అందు 8 తు॥ పిప్పలిచూర్ణము 8 తు॥ పాత్రితనేయి చేర్చి లేహ్యపాకమున దించి చల్లారినపిదప 64 తు॥ తేనెచేర్చి పూటకు ½ తు॥ సేవించిన కాసలు శమించును.

### —♦ ఉబ్బసమునకు చిత్రకాదిగుటికలు. ♦—

దుష్టుపువేరు, పచ్చి చిత్రమూలము, నేలవేము, వల్లిజీలకఱ్ఱ, ఖిరియామాలు, కురంజివాము, ఖురసాని వాము సమభాగములు గ్రహించి గుంటగలగర పైడిపత్తియాకు కాకరాకురసములతో 3 దినములు మర్దించి కుంకుడుగింజలంత మాత్రలుచేసి గసగసాలరసముతో యిచ్చిన తమకశ్వాస శమించును.

### —♦ అపరాజితాదినస్యక్రియ. ♦—

తెల్లదింటెనవేరు రసము మునగచెక్క రసము నరమూత్రము గోమూత్రము ఇవిప్రత్యేకము పావుశేరు (కొల్త) గాడిద మూత్రము అర్ధశేరు (కొల్త) వీనిని మట్టిపాత్రలోబోసి కాచు లవంగాలు నల్లమందు వీనిని ప్రత్యేకము ¼ తు॥ చేర్చి 15 దినముల వరకు ప్రతిదినము కొలదిసేపుచొప్పున వెచ్చబెట్టుచు 15 వ దినమున యిగుడునవరకు కాచి 1, 2, గురిజలయెత్తు



మాత్రలుచేసి తమలపాకు రసముతో దినమునకు రెండుసారులు యివ్వవలెను. 5 లేక 7 దినములు చాలును. ఉబ్బసము తగ్గును. మరల 8 మాసముల వరకు ఉబ్బసమురాదు. 9 వ మాసారంభమున 5 దినములీ మాత్రలను వాడిన ఉబ్బసము నివర్తించు.

### —♦ రాజరాజేశ్వరీవటిక. ♦—

శొంఠి మోడి మిర్యాలు లవంగాలు సౌవర్చ సైంధవలవణములు నల్లమందు వాము కటుకరోహిణి ఇవి ప్రత్యేకం 1 తు॥ చూర్ణించి యుంచుకొనేది. తెల్లజిల్లేడుపూవు ఉమ్మెంతపూవు మునగపూవు వాకుడుపూవు నేలములకపూవు దుష్టుపు యిగుళ్ళు జెముడుయిగుళ్ళు లేత నల్లేరుకాడలు వీనిని కూడ తులం చొ॥ గ్రహించి మెత్తగానూరి ముద్దజేసి పండుజిల్లేడాకులలోచుట్టి దారంతో బిగించి పేడపూసి పుటపాకముచేసి పై చూర్ణముతో చేర్చి పండుజిల్లేడాకు రసము (అనగా నిప్పులపైన ఆకులను కాచి నలిపి తీసినరసము) తోను నల్లేరు రసముతోను 4 దినములు మర్దించి కుంకుడు గింజలంత మాత్రలుచేసి యుంచుకొని రోజునకు 2, 3 మాత్రలవరకు అల్లపురసం తేనెతో వాడవలెను. ఉబ్బసపుదగ్గు తప్పక నివర్తించును. పథ్యం:—కందిపప్పు పాతబియ్యపు అన్నము వేయించిన ఉప్పు పుల్లమజ్జిగ మొదలగునవి. 1845 సరవ

త్సరమున నీయోగము ఒక సిద్ధుని వలన గ్రహించి నూజవీడు జమీందారులచే వాడబడినది.

—♦ సిద్ధసంజీవి. ♦—

శంఖపాషాణము ఇంగిలీకము తాళకము ప్రత్యేకము రెండుతులములు, సైంధవలవణము 40 తు॥ వీనిని జిల్లేడుపాలతో నూరి కొబ్బరికురిడీలో యెక్కించి కుండలో పెట్టి చీరజేసి 100 పిడకలతో పుటము వేసి తీసి కొబ్బరికురిడీసహా చూర్ణించుకొని 1, 2 అణాలయెత్తు యిచ్చిన శ్లేష్మమును కోయును.

—♦ అనుభూతక్రియ. ♦—

పొటాస్ అయోడిడ్ నల్లవుప్పివేరు చిత్రమూలము ఫిరంగిచెక్క వాము తెల్లబాడిదచెక్క పంచలవణములు కలసి ఒకభాగము ఇంగువ కురంజివాము కురసానివాము శొంఠి పిప్పలి మిర్యాలు సమముగ గ్రహించి నారింజపండ్లరసముతో వారము మర్దించి కుంకుడుగింజలంత మాత్రలుచేసి పులిమజ్జిగతో దినమునకు 2, 3 సార్లు పుచ్చుకొనుచున్న ఉబ్బసము మేఘరంజి నశించును.

—♦ జాతీఫలాదిచూర్ణము. ♦—

జాజికాయ వాయువిడంగాలు చిత్రమూలము వంగభస్మము నువ్వులు శొంఠి లవంగాలు ఏలకులు పచ్చకర్పూరము కరక్కాయ ఉశిరిగపప్పు మిర్యాలు



పిప్పళ్ళు తవక్షీరి యివిప్రత్యేకమొకతులము. ఏలకులు లవంగాలు ఆకుపత్రి నాగకేసరాలు యివి ప్రత్యేకము 4 తు॥ గంజాయి 7 తు॥ వీనినన్నిటిని మిగుల మృదువుగ చూర్ణించి చూర్ణమునకు సమముగ శర్కరచేర్చి పూటకు 2 చిన్నములుచొ॥ సేవించుచుండిన దారుణమగు కల్లెదగ్గు క్షయ ఉబ్బసము గ్రహణి అరుచి పీనస అగ్నిమాంద్యము పడిసెముతోగూడిన దగ్గుహరించును. అనుభూతయోగము.

—♦ దాడిమోష్టము. ♦—

200 తు॥ ల దాడిమపండ్లను 2208 తులముల నీటిలోవేసి నాలగవవంతు మిగులునట్లు కాచి వడియగట్టి అందు 800 తు॥ బెల్లము, జాపత్రి దాల్చినచెక్క యేలకులు నాగకేసరములు పేరింఖణము మిరియాలు పిప్పళ్ళు వాయువిడంగములు వీనిని ప్రత్యేకము 4 తు॥ ల చొ॥ చూర్ణించి యందుచేర్చి భాండమందుంచి పైన మూకుడుమూసి సంధిబంధము గావించి నెలవరకు నుంచి తీసి వడియగట్టెది. ఉరఃక్షతము క్షయ శ్వాస కాసలు గళరోగము తగ్గును. శరీరమునకు బలముకలుగును మలబంధమునువిప్పును

—♦ సితోపలాదిచూర్ణము ♦—

పటికిబెల్లము 16 భాగములు తవక్షీరి 8 భా॥ పిప్పలి 4 భా॥ ఏలక్కాయలగింజలు 2 భా॥ దాల్చి

నచక్క 1 భా॥ వీనిని మృదువుగచూర్ణించి చిన్నం మొదలు రెండుచిన్నపెసలయెత్తు తేనె, వెన్న మొదలగు అనుపానములతో సేవించునెడల పొడిదగ్గు అరకాళ్ళు అరచేతులు మంట పిత్తతాపము ముక్కునోరువెంట రక్తముపడుట నాలుక మొద్దుబారి రుచితెలియకయుండుట తగ్గును. సుప్రసిద్ధయోగము.

—◆ భావనహరీతకి. ◆—

కరక్కాయ వలుపు 5 శేర్లు (100 తు॥) సైంధవలవణము 6 తు॥ యాలక్కాయలు దాల్చినచెక్క తవక్షీరె లవంగాలు ఆకుపత్రి శొంఠి పిప్పళ్ళు మిరియాలు తానికాయ ఉశిరికపప్పు వీనిచూర్ణము ప్రత్యేకము తులము వీనిని జేర్చి మృత్పాత్రలో నుంచి గుంటకలగర నిమ్మపండ్లు నారింజపండ్లు మాదీఫలము పుల్లదానిమ్మ పులిచింత అనువానిరసములతో ప్రత్యేకము 7 దినములు భావనచేసి సేవించిన పంచవిధకాసలు అజీర్ణము ఛర్ది రొమ్ములోమంట శమించును.

—◆ రసరాట్. ◆—

రసము ఇంగిలికము రససిందూరము రసకర్పూరము ఇవిప్రత్యేకము 1 భా॥ గంధకము 8 భా॥ లోహపురజను 4 భా॥ వీనిని కలుబందరసముతో బాగుగమర్దించి మూకుడులోపోసి గంధకముమాత్రము యెగిరిపోవువరకు వేయించి కలబందరసముతో 7 ది



నములు మర్దించి కుప్పెలు కట్టేది. దీనిని గుంజప్రమాణము తేనె అల్లపురసము మొదలగు వాటితో నిచ్చిన వాతకఫ కాసలు నివర్తించును.

—◆ రజతలోహరసాయనము. ◆—

వెండిరజను 1 భా॥ లోహరజను 2 భా॥ రసము 4 భా॥ గంధకము 8 భా॥ వీనిని కలబంద సాంబ్రాణిఆకు గుంటకలగర గలిజేరు అల్లము చిత్రమూలం నల్లేరు అడ్డసరము అను రసములతో మర్దించి మాత్రలుచేసి శరావసంపుటమునందుంచి సంధి బంధము చేసి 16 పిడకలతో పుటముబెట్టి తీసి మరల పైరసములతో మర్దించి కుప్పెలు కట్టునది. మో॥ 2, 3 గుంజలెత్తు ఉడుకుదగ్గు శుక్లనష్టము మేహనంజు రక్తక్షీణత శమించును. రక్తశుద్ధి యగును.

—◆ కఫవిధ్వంశిరసము. ◆—

రసము గంధకము తామ్రభస్మము నాభి ఇంగిలీకము మణిశిల తాళకము చంగల్వకోష్టు పిప్పళ్ళు గజపిప్పళ్ళు పొగాకుకట్టెల క్షారము దుంపరాష్ట్రము మోడి గంటుభారంగి చిత్రమూలము ఉప్పుభస్మం సమభాగముగ గ్రహించి వెల్లుల్లిరసము జిల్లేడువేళ్ళరసము అడ్డసరపుకషాయము నేలతాడిరసం చిత్రమూలరసం మునగపట్టరసం అనురసములతో మర్దించి

కందిగింజంత మాత్రలుచేసి వాడిన కఫములను కోయును. సన్నిపాతములందుగూడ పనిచేయును.

——♦ రెండవయోగము ♦——

అతిమధురంపాలు పొంగించిన వెలిగారం కర్కాటకశృంగి అప్పలుహోసుగింజలు సమముగ గైకొని నీళ్ళతోనూరి మాత్రలుచేసి నోటిలోను చుకొని ద్రవము మ్రింగుచున్న పొడిదగ్గుతగ్గును.

♦—— రోచనాదిమాత్ర. ♦——

సాంబ్రాణిపువ్వు తులము, గోరోచనము అరతులం, లవంగాలు 2 తు॥ తమలపాకు రసముతో రెండుజాములు నూరి కందిగింజలంత మాత్రలుచేసి దినమునకు 4, 5 మాత్రలు తేనెతోయిచ్చిన ఆయాసము దగ్గు తగ్గును.

——♦ సింహాస్యాదివటి. ♦——

అడ్డసరపుఆకుల కషాయమును కాచి వడియగట్టి దానిని మరల ఇగురువరకు కాచిన రసక్రియ అగును. అట్టి రసక్రియ 4 తు॥ తెల్లజిల్లేడు వేరుపట్ట 1 తు॥ నల్లమందు 1 తు॥ హారతికర్పూరము ½ తు॥ వీనిని మెత్తగ నూరి గురివెందలంత మాత్రలు చేసి యుపయోగించిన దారుణమైన కష్టదగ్గు ఆయాసము రొమ్ముపగిలి బాధగనుండుట రక్తపిత్తము ప్రదరరోగము నిస్సంశయముగ హరించును. అనుపానము తేనె.



శోఫరోగప్రకరణము.

——♦ గోమూత్రక్షారము. ♦——

గోమూత్రమును కుండలోబోసి ఇగురునట్లు కాచినచో అడుగున నల్లనిక్షారము మిగులును. దానిని గ్రహించి అందొకచిన్నముమందుతో, మండపసుపు వాముపొట్టు రెండునుకలసి 3 చిన్నములు చేర్చి ఉష్ణోదకముతో యివ్వవలెను. ఇట్లు దినమునకు రెండు పూటలు నిచ్చునెడల 20 దినములకు శరీర మందలి నీరు తీసిపోవును. ఆయాసము తగ్గును.

——♦ లోకనాథరసము. ♦——

గవ్వభస్మము 1 భా॥ లోహభస్మము అరభాగము మండూరము 1 భా॥ రసభస్మము ½ భా॥ గంధకం ¼ భా॥ వీనిని నల్లేరు చిత్రమూలము గలిజేరు గుంటకలగర త్రిఫలకషాయము అడ్డసరము సాంబ్రాణిఆకు వీనిరసములతో మర్దించి మాత్రలుచేసి లఘుపుటముచేసి ఆ ఔషధమునకు సమము మిరియాలనుచేర్చి పై రసములతో మర్దించేది. చిన్నము మందుతో లోహసిందూరమొక అడ్డిగెత్తుకలిపి 3 చిన్నముల అహిపతిచూర్ణమునుచేర్చి ఉదయమున గోమూత్రముతోను సాయంత్రమున వేడినీరుతోను యివ్వవలెను. దినమునకు 2, 3 విరేచనములై మూత్రము జారీఅగుచు నీరుతగ్గి రక్తముపట్టును.

—♦ అహింపతిచూర్ణము. ♦—

ఉశిరెగపప్పు వాయువిడంగాలు ఏలకులు దాల్చిన పట్ట ఆకుపత్రి తుంగముస్తలు త్రికటుకములు కరక్కాయలు ఇవి ప్రత్యేకము 1 భా॥ తెల్లతెగడ 3 భా॥ అన్నిటికీసమం పంచదార. వీనిని చూర్ణించి వాడిన శూల అగ్నిమాంద్యము మూలరోగము ప్రమేహము క్రిములు గర్భశూల వాత పిత్త కఫ పాండువులు శమించును.

—♦ వజ్రమండూరము. ♦—

శుద్ధకిట్టమును గోమూత్రముతో 1 దినము వండి దానికి సమముగ సజ్జీరుక్షారము చింతబొగ్గుక్షారము కలిపి తేనెతో మర్దించి చిల్లగింజంతమాత్రలుచేసి దినమునకు రెండుపూ॥ యిచ్చిన శోఫలుహరించును.

—♦ లవణమండూరము. ♦—

100 సం॥ వయస్సుగల యినుపచిట్టెమును యెర్రగకాల్చి గోమూత్రములో ముంచవలెను. యిట్లు 7 సార్లు కాల్చి చల్లార్చిన చిట్టెపుచూర్ణమునకు సమముగ సైంధవలవణమును చేర్చి గోమూత్రము పోసి వండవలెను. యిట్లు వండిన ఔషధమును యేరు పిడకలలో పుటము వేయవలెను. దీనిని తేనె పులిమజ్జిగ మొదలగు అనుపానములతో బలానుకూలముగ (చిన్నం) సేవించునెడల పాండువు, తప్పకనివర్తించును.



—♦ తారమండూరము. ♦—

వాయువిడంగాలు చిత్రమూలము చవ్యము త్రిఫలములు త్రికటుకములు ఇవి ప్రత్యేకము 1 భా॥ అన్నిటికి సమం మండూరము వీనికన్నిటికి సమం పాతబెల్లము. వీనికన్నిటికి రెండురెట్లు గోమూత్రం చేర్చి మృత్పాత్రలోపోసి సన్ననిమంటతో గోమూత్రమిగురువరకు పాకముజేసి కుంకుడుగింజలంత మాత్రలుచేసి వేడినీరుతో దినమునకు రెండు పూ॥ సేవించిన పాండువు కామిల నిస్సంశయముగ హరించును.

—♦ తాళీశాది చూర్ణము. ♦—

తాళీశపత్రి వాయువిడంగాలు త్రికటుకములు జంగిలీహరడా కటుకరోహిణి చేవల్చిన్ని ప్రత్యేకము 1 తు॥ సునాముఖి 2 తు॥ తెల్లతెగడ 8 తు॥ సర్వసమము చక్కెరచేర్చి చూర్ణించి అందు 2, 3 చిన్నముల చూర్ణముతో అడ్డికెత్తు కాంతమునుగాని ఖడ్గముగాని కలిపి ఉదయమున గోమూత్రముతోను సాయంత్రమున గుంటగలగరాకు రసము లేక ఉష్ణోదకముతో నిచ్చిన పరిశుద్ధరక్తముపట్టును. పాండుశోఫలు నశించును. విరేచనము కును

—♦ కాంతకాసీసము. ♦—

రక్తముపలచనై కాళ్లు చేతులు లాగుట అజీర్ణము అగ్నిమాంద్యము ఆయాసము గలిగియున్నవు

డిది గుణమిచ్చును. చూ. భస్మసింధూరప్రకరణం.

—♦ వజ్రలోహము. ♦—

లోహపురజను మండూరము కాంతలోహము యివి ప్రత్యేకము తు 10 లు నేరేడుచెక్కరసముతో నూరి మూడుబిళ్ళలుగచేసి వానిని ఆముదపుఆకులలో చుట్టి ఒకకుండలో ఆబిళ్ళలనుంచి పైన క్రింద కుంచెడు వరిధాన్యముపోసి ధాన్యమంతయు మునుగు వరకు నీరుపోసి పొయ్యిమీదనుంచి మంటబెట్టుచు నీరు యిగిరి క్రిందనున్న ధాన్యము తెగులబడి యెర్రని పొగ బయలు వెడలునరకు వండి దించి స్వాంగశీతలమైన పిదప అందుండు మూడుబిళ్ళలను తీసుకొని చూర్ణించి వస్త్రగాలితముచేసి భద్రపరచునది. మోతాదుఅడ్డిగెత్తు. గుణము:—రక్తతెరప పాండువు సంజుమున్నగువానియందు అమోఘముగు పనిచేయును.

—♦ అర్శఃప్రకరణము. ♦—

—♦ బృహత్సూర్ణవటి ♦—

అడవికంద 16 తు॥ వృద్ధదారు 16 తు॥ నేలతాడిగడ్డలు 8 తు॥ చిత్రమూలము 8 తు॥ త్రిఫలములు వాయువిడంగములు శొంఠి పిప్పళ్ళు నల్లజీడిగింజలు మోడి తాళీసపత్రి ఇవిప్రత్యేకము 4 తు॥ ఏలకులు దాల్చినచెక్క మిరియాలు ప్రత్యేకము2తు॥ చూర్ణించి అన్నిటికి రెట్టింపు పాతబెల్లములో పాకముపట్టి



సేవించవలెను. మూలరోగము మందాగ్ని వాతకఫజనిత గ్రహణులు శ్వాసకాసలు క్షయ ప్లీహ బోదకాలు వాపులు ఎక్కిళ్లు ప్రమేహము భగందరము నశించును.

—♦ త్రివృత్ లేహ్యము ♦—

తెల్లతెగడ 32 భా॥ శొంఠి 16 భా॥ శేవల్చిన్ని 8 భా॥ సునాముఖి 4 భా॥ శేతకరకాయ చిప్పలు 2 భా॥ నల్లజీడిగింజలు 1 భా॥ అన్నిటికి సమం పటిక బెల్లం, అన్నిటిలో 8 వ వంతు తేనె వీనినెల్ల చేర్చి బాగుగమర్దించి సేవించి వేడినీరును త్రాగవలెను. మలబద్ధము మూలవ్యాధి నశించును.

జ్ఞాపిక:—సాయంత్రం త్రివృత్ లేహ్యము ఉదయమున బృహత్సూరణవటిని సేవించునది

—♦ త్రివృత్ లేహ్యము ♦—

తెల్లతెగడవేరు చూర్ణము సునాముఖి గులాబిమొగ్గలు శొంఠి వీనిచూర్ణము ప్రత్యేకమొకభాగము పటికిబెల్లము రెండుభాగములు ద్రాక్షపండు ½ భాగము వీనిని ఖల్వమునందుంచి అవసరమగునంత తేనె చేర్చి బలముగ మర్దించవలెను లేహ్యమువలె ఉండ అగునట్లు మర్దించి యుంచుకొనవలెను. ఇది మిగుల సుకుమారముగ విరేచనము చేయును. మలబద్ధరోగులు ప్రతిసాయంత్రము పరుండబోవునపుడు అరతు

లం చో॥ పుచ్చుకొనుచుండిన చక్కగ ఉదయమున విరేచనము అగును.

### కాసీసాదితైలము.

అన్నభేది నీరుపిప్పలి కోష్టు శొంఠి పిప్పళ్ళు సైంధవము మణిశిల వాడగన్నేరువేళ్ళు వాయువిడగాలు చిత్రమూలము అక్షసరము దంతిమూలము చేమబీరగింజలు ఉమ్మెత్తవేళ్లు తాళకము ప్రత్యేకము 1 తు॥ చో॥ కల్కము నువ్వులనూనె 64 తు॥ జెముడుపాలు 8 తు॥ జిల్లేడుపాలు 8 తు॥ నూనెకు నాలుగురెట్లుగో మూత్రము వీనినెల్ల చేర్చి నూనె మిగులునట్లు కాచి వడియగట్టి మొలలకు లేపముచేయు నెడల మొలలు నశించిపోవును.

### అనుభూతయోగము.

పచ్చుతంగేడువేళ్ళపట్టను ఒకకుండలోవేసి మూకుడుమూసి చీలజేసి కుండ అడుగున రెండు మూడు చిన్నచిన్న బెజ్జములనుపొడిచి ఆ బెజ్జములకు సరిగ ఒక చిన్న పిడతనమర్చి పిడత కంఠము వరకు భూమిలో పాతిపెట్టి పైన పిడకలతో పుటమువేసినతో అడుగు పిడతలోనికి ఒకవిధమగు ద్రావకముదిగును. ద్రానిని పూటకు పావుతులము చో॥ పంచదారతో జేర్చి తినుచున్న ఒకనెలకు మొలలు హరించిపోవును.



### అర్శోహర చంద్రప్రభావటి.

వాయువిడంగములు చిత్రమూలము మిర్యాలు శొంఠి పిప్పలి త్రిఫలములు దేవదారుచెక్క చవ్యము నేలవేము మోడి తుంగముస్తలు కచూర్యాలుములు వస హేమమాక్షికభస్మము సైంధవ సౌవర్చల బిడ కాచ సాముద్రలవణములు యవక్షారము సర్జక్షారము టంకణక్షారము పసుపు మానుపసుపు ధనియాలు గజపిప్పళ్ళు అతివస ప్రత్యేకము 1 తు॥ గోమూత్ర శిలాజిత్తు 8 తు॥ మహిసాక్షిగుగ్గిలము 2 తు॥ లోహభస్మము 2తు॥ పంచదార 4 తు॥ తవక్షీరి దంతిమూలము తెగడవేరు దాల్చినచెక్క ఏలకులు జాపత్రి ప్రత్యేకము 1 తు॥ ఖల్వమునందుంచి మర్దించి అణాయెత్తు మాత్రలుచేసి మజ్జిగతో వాడిన అన్ని మూలవ్యాధులు నివర్తించును. భగందరము వ్రణములు గూడ నశించును.

### అర్కక్షీరము.

తెల్లజిల్లేడుపాలతో మందముగు తెల్లనివస్త్రమును తడిపి యెండించవలెను. యిట్లు 7 మారులు తడిపి యెండించి కాల్చి మసిచేసి పూటకు రెండుచిన్నముల భస్మమును తులము ఆవునెయ్యిలో కలిపి తినుచుండు నెడల ఒకనెలలో మొలలు హరించిపోవును. నిస్సంశ

యము. ఇది సిద్ధులవలన గ్రహింపబడిన అతి రహస్యయోగము.

—♦ మొలలకు ధూమము. ♦—

ఏనుగుచర్మము కానుగుగింజలు పిల్లిచర్మము వీనినన్నిటినిగాని, ప్రత్యేకముగగాని, పొగవేసిన తీపు మంట తగ్గును.

—♦ కట్టు. ♦—

పైడిప్రత్తియాకును మెత్తగనూరి ఆసనమునకు కట్టు కట్టినయెడల అమితమైన తీపు బాధ ఒక గంటలో మాయమగును. ఇట్లు 20 దినములవరకు కట్టుచున్న కొందరకు మొలలు హరించిపోవుటయు కలదు గాని తాత్కాలికపుబాధ తగ్గుటకు సంశయములేదు.

—♦ తిలాదిమోదకము ♦—

నువ్వుపప్పు శుద్ధిచేసిన నల్లజీడిగింజలు కరక్కాయ పాతబెల్లము సమముగ మర్దించి తులం వటకములు చేసి దినమునకు రెండు చొ॥ పుచ్చుకొన్న అర్శస్సు హరించును.

—♦ వాతవ్యాధిప్రకరణము. ♦—

—♦ వాతవిధ్వంశరసము. ♦—

రసము గంధకము సీసభస్మము వంగభస్మము లోహభస్మము తామ్రభస్మము కృష్ణాభ్రకభస్మము పిప్పళ్లు వెలిగారం మిరియాలు, శొంఠి ఇవి ప్రత్యేక



ము 1 భా॥ నాభి 4¼ భా॥ వీనిని త్రికటు కషాయము చిత్రమూలము గుంటకలగర కోష్టు రసములతో ప్రత్యేకము 3 దినములును, వావిలి అల్లము అడ్డసరము గంజాయిఆకు నిమ్మపండ్లు వీని రసములతో ప్రత్యేకము 1 దినము మర్దించి గుంజాప్రమాణం మాత్రలుచేసి వాడిన వాతశ్లేష్మరోగములు గ్రహణి సన్నిపాతము మూత్రవాతము అపస్మారము అగ్నిమాంద్యము శీతపిత్తము సూతికావాతము హరించును.

—♦ అగ్నితుండిరసము. ♦—

రసము గంధకము నాభి అజామోదము త్రిఫలములు సర్జక్షారము యవక్షారము చిత్రమూలము సైంధవలవణము జీలకర్ర సౌవర్చలవణము విడంగాలు వెలిగారము త్రికటుకములు ఇవిప్రత్యేకము 1 భా॥ అన్నిటికిసమం విషముష్టి విత్తుల చూర్ణము, వీనిని నిమ్మపండ్ల రసముతో నూరి మిరియపుగింజలంత మాత్రలుచేసి అల్లపురసముతో నిచ్చిన 80 వాతములు అగ్నిమాంద్యము గ్రహణి హరించును.

—♦ మహావాతరాక్షసము. ♦—

స్వర్ణము కాంతము నాగము వంగము లోహము తామ్రము రజతము శంఖము వెలిగారము నాభి నేపాలము హేమమాక్షికము పాంతుత్థము గవ్వ ఇంగిలీకము తాళకము అభ్రకము వీనిని సమముగ గ్ర

హించి త్రికటుకములు భద్రముస్తలు లవంగాలు చిత్రమూలము వీని రసములతో మర్దించి వాలుకాయంత్రమున రెండుజాములు వండి పైరసములతో మర్దించి సూపప్రమాణం మాత్రలు చేసేది. సర్వవాతములందు వాడదగియుండును.

## —♦ యోగరాజగుగ్గులు. ♦—

శొంఠి, పిప్పళ్ళు చవ్యము మోడి చిత్రమూలము పొంగించిన యింగువ అజామోదము ఆవాలు జీర నల్లజీర రేణుకలు కొడిశపిత్తులు విషబొద్ది వాయువిడంగాలు గజపిప్పళ్ళు కటుకరోహిణి అతివస గంటుభారంగి వస చాగవేరు ఇవి ప్రత్యేకము అణాయెత్తు చూర్ణించి అన్నిటికిసమం మహిసాక్షిని పాకముబట్టి అందు చూర్ణమును చేర్చి వంగ రజత సీస అభ్రిక మండూరభస్మములు రససిందూరము అనువానిని ప్రత్యేకము 4 తు॥ కలియగలిపి మాత్రలుచేసి యిచ్చిన వాతములు మూలరోగము గ్రహణి ప్రమేహములు భగందరములు క్షయ అగ్నిమాంద్యము శ్వాస కాసలు శుక్రదోషములు ఋతుదోషములు నశించును. ఇది గోమూత్రముతో పాండువును ఉసిరిపసుపు కషాయముతో ప్రమేహమును పాదిరివేళ్ళ రసముతో ఎలుకవిషమును హరించును.



## —♦ వాతారితైలము. ♦—

వెల్లుల్లి 40 తు॥ మిరపకాయల చూర్ణము 40 తు॥ నల్లమందు 3 తు॥ నువ్వులనూనె 80 తు వీనిని ఒక యినుపపాత్రలో బోసి పైన నొక యినుపపాత్ర బోర్లించి సంధిబంధముచేసి పొయ్యిక్రింద పాతివేసి ఆ పొయ్యిమీద ప్రతిదినమును వంట చేసుకొనుచుండవలెను. ఆకారణ యినుపపాత్రలోని ద్రవ్యములు చక్కగ పచనమగును. ఇట్లు 15 దినములు కడచినతరువాత తీసి చక్కగా చేతులతో పిసికి వడబోసి మర్దన చేసిన ఆమవాతము పక్షవాతము మొదలగు సకల వాతనొప్పులు 1, 2 దినములలో నెమ్మదించును. అత్యంత ఫలదాయకము.

## —♦ తాళీశాదివటి. ♦—

తాళీసపత్రి దాల్చినచెక్క కరక తాని యుసిరిగలు శొంఠి పిప్పలి మిర్యాలు పన్నీరుమొగ్గలు గోరింటవేరుపట్ట గంగరావిపట్ట వేపవేరుపట్ట తుంగముస్తలు ఫిరంగిచెక్క మరాటీమొగ్గలు కోష్టుకానుగు వేరుపట్ట ప్రత్యేకము తులము చొ॥ చూర్ణించి 10 తులముల మహిసాక్షి గుగ్గిలముతో చేర్చి పాకము పట్టి కుంకుడుగింజలంత మాత్రలుచేసి దినములకు 6 మాత్రలు సేవించుచున్న తిమ్మిర్లుతగ్గును.

—♦ మరియొకసిద్ధప్రక్రియ ♦—

పాలితవియగు తాటిబుర్రలనుండి పాతాళయంత్రమున దీసిన ద్రవమును ప్రూటకు 5 చుక్కలు పంచధారలోవేసి దినమునకు మూడుసారులు సేవించుచున్న తిమ్మెరలు తప్పకతగ్గును. ఉత్తమయోగము.

—♦ కాంచనరసము. ♦—

పగడపుభస్మము అభ్రిసిందూరము లోహసిందూరము ఇంగిలీకము సమభాగములు గుంటగలగర రసముతో 3 దినములు నూరి 4 గుంజలెత్తు దినమునకు 2 సార్లు వాడిన తిమ్మెరలు మేహసంజు కాలు చేతులు మంట తగ్గును.

—♦ శతావరీతైలము. ♦—

పిల్లిపీచర, బల మహాబల కోలపొన్న, ముయ్యాకుపొన్న, ఆముదపువేళ్ళు, పెన్నేరు దుంప, పల్లేరు, మారేడు, రెల్లు, గోరింట వీనివేళ్ళు ప్రత్యేకము 6 తు॥ నలియగొట్టి 4 రెట్ల నీటిలో వేసి 4 వ వంతుగ కాచి వడియగట్టి అందు 64 తు॥ నువ్వులనూనె, 64 తు॥ ఆవుపాలు 64 తు॥ పిల్లిపీచర రసము 64 తు॥ నీరు చేర్చి పిల్లిపీచర దేవదారు జటామాంసి గ్రంధి తగరము శ్రీగంధము పెద్దసదాప బల కోష్ఠ ఏలకులు వాతిపువ్వు నల్లకలువ బుద్ధి లేక నేలతాడి మద లేక



యష్టిమధుకము ఇప్పపట్ట కాకోలి లేక పెన్నేరు జీవకము లేక నేలగుమ్మడి వీనిని ప్రత్యేకం తులం చొ॥ కల్కము చేసి చేర్చి కాచి వడగట్టి సేవించిన సంభోగశక్తి సత్సంతానము కలుగు. అంగశూల శిరశ్శూల కామెల పాండువు విషదోషము గుల్మ ప్రసీవాతము ప్లీహ శోష మేహములు అస్రుగ్దరము కడుపుబ్బరము రక్తపిత్తము నశించును. స్త్రీలయోని శూలపోవును.

—♦ అర్కక్షీరతైలము. ♦—

జిల్లేడువేళ్ళరసము మేకపాలు వావిలియాకు కషాయము చింతాకురసము నువ్వులనూనె ఇవి సమభాగములు, నూనెలో సగము ఆముదము, వీనినెల్ల చేర్చి తైలపక్వముగ కాచి వడియగట్టి మర్దనచేసిన యెడల పక్షవాతము కీళ్ళనొప్పులు తప్పక కుదురును.

—♦ విషతిందుకతైలము. ♦—

4 శేర్లు ముష్టిగింజల కషాయములో 32 శేర్ల జొన్నకలిపోసి 8 శేర్లు మిగులునట్లు కాచి వడియగట్టి అందు 8 శేర్ల నిమ్మపండ్లరసము, 4 శేర్ల విషముష్టి విత్తుల కల్కము, 4 శేర్ల ఆముదము, 8 శేర్ల నూనె చేర్చి కాచి వడియగట్టి శరీరమునకు లేపముచేసిన సర్వాంగ సంధి అస్థి ఆమ కఫ విలోమ అనులోమ ఊరుస్తంభ ధనుర్వాతాదులు శాంతించును.

## అపస్మార ప్రకరణము.

### —♦ కూష్మాండఘృతము. ♦—

బూడిద గుమ్మడికాయ రసము 18 భా॥ నేయి 1 భా॥ యష్టిమధుకకల్కము నేతిని 4 వ వంతు చేర్చి సిద్ధపరచిన ఘృతము అపస్మారమును హరించును.

### —♦ బ్రాహ్మీఘృతము. ♦—

సరస్వతియాకురసము 4 ప్రస్థములు, నేయి 1 ప్రస్థము, వస, చెంగల్వకోష్టు, శంఖపుష్పి వీని కల్కము నేతికి నాల్గవవంతు చేర్చి సిద్ధపరచిన ఘృతమును సేవించిన అపస్మారమును హరించి బుద్ధి బలము జ్ఞాపకశక్తి వాచాలత వీనిని కలిగించును.

### —♦ పంచగవ్యఘృతము. ♦—

మారేడు నల్లి దుండిలము పెగ్గుమ్మడు కలిగొట్టు ముయ్యాకుపొన్న కోలపొన్న ములక ఛాకుడు పల్లేరు వీని వేళ్ళు పసుపు మానిపసుపు కొడిశపట్ట పడాకులకటి ఉత్తరేణు నీలి కటుకరోహిణి శేల బ్రహ్మమేడి పుష్కరమూలము దూలగొండివేరు ప్రత్యేకము 2 పలములు నలియగొట్టి ద్రోణ ప్రమాణోదకమందు వేసి 4 వ వంతుగ కాచి వడియగట్టి అందు 4 వంతు నేయి చేర్చి ఆవుపెరుగు ఆవుపాలు గోమూత్రము వీనిని నేతికి సమముగ జేర్చి అందు గంటుభారంగి అగరుశొంఠి త్రికటుకములు తెల్లతెగడ ప్రబ్బ గజ



పిప్పళ్లు కందులు చాగవేరు తెల్లదంతెన నేలవేము చిత్రమూలము పాలసుగంధి నల్లసుగంధి కామంచి నాము అడవిమల్లె వీనిని అతుము చొ॥ కల్కముచేసి వైచి సిద్ధపరచిన ఘృతమును సేవించిన అపస్మారము జ్వరము కాస ఉదరరోగము గుల్మము మూలవ్యాధి పాండువు కామిల హలీమకము హరించును.

### —♦ సారస్వతారిష్టము. ♦—

సరస్వతియాకు స్వరసము 80 తు॥ నేలగుమ్మడు, కరక్కాయ, వట్టివేరు అల్లము సదాపఆకు యివి ప్రత్యేకము 20 తు॥ గ్రహించి 1024 తు॥ ల నీటిలో వేసి 4 వ వంతు మిగులునట్లు కాచి వడియగట్టి పైస్వరసమును కషాయమును ఒక కుండలో బోసి అందు 40 తు॥ తేనెయు, 100 తు॥ పంచదారయు, 20 తు॥ అరెపూవును, రేణుకలు తెగడ పిప్పళ్ళు లవంగాలు వస చంగల్వకోష్టు పెన్నేరు తానికాయ తిప్పతీగ ఫలములు విడంగాలు దాల్చినచెక్క యివి ప్రత్యేకము ఒకతులము చూర్ణించి చేర్చి అందు పలచనగ చేయబడిన బంగారు రేకులుగూడ వేసి సంధిబంధము చేసి ఒకమాసము నిల్వయుంచి తీసి వడియగట్టి దానిని ప్రాతను తులము చొ॥ సేవించుచుండిన అపస్మారము మూర్ఛ మొదలగు రోగములు నశించును. మాటలు రాని బిడ్డలకిచ్చిన మాటలు వచ్చును. నతి మొద

లగు వ్యాకోపములు హరించును.

—♦ సిద్ధయోగము. ♦—

రేలచెక్కగంధము తెల్లచందనపు గంధము కొమును కలసి ఒకతులము ప్రతిదినము ఉదయముననే తినుచున్నయెడల ఒకమాసమునకు మూర్ఛరాకుండ నిలచిపోవును. మూర్ఛవచ్చినప్పుడు బాగుగా పండిన 1 కుంకుడుకాయపట్టు, 2 యాలక్కాయలలోని గింజలు, 3 లవంగములు చూర్ణించి ముక్కులలో ఊదవలెను. మూర్ఛలో నున్నప్పుడే యీ నస్యము నుపయోగించవలెను. గాని తెలివిగనున్న సమయములందుపయోగింపరాదు.

—♦ పథ్యములు. ♦—

పొన్నగంటి వ్రీహిధాన్యము గోధుమలు పెసరకట్టు నేయి ఉశిరికకాయ పొట్లకాయ మునగ గుమ్మడికాయ చిర్రి చక్రవర్తికూర వెలగపండు దానిమ్మపండు ద్రాక్షపండు పిత్తహారకవస్తువులు.

—♦ అపథ్యములు. ♦—

మద్యము విరుద్ధాన్నము ఉష్ణభోజ్యములు మలమూత్ర నిరోధము చేయు ద్రవ్యములు.

## స్త్రీరోగ ప్రకరణము.

—♦ మహాసూచికాభరణ రసము. ♦—

కృష్ణాభ్రకము గంధకము సీసము [illegible]కము



వంగము రక్తమణిశిల ఇనుప భస్మము తామ్రము కాంస్యము రసము వైక్రాంతము హేమమాక్షికము ఇత్తడిభస్మము ఖడ్గలోహము కాంతము ఇంగిలీకము ముత్యము శంఖము మైలతుత్థం కపర్ది పగడము స్వర్ణము శుక్తిభస్మము రజతము ప్రత్యేకము 1 తు॥ శుద్ధనేపాళములు 3 తు॥ కల్వమందుంచి బ్రహ్మజెముడు నేలమ్రాకి కామంచి నేలములక కాకర తెల్లదింతెన వావిలి మునగచెక్క జిల్లేడువేరు నల్లేరు వీని రసములతో ప్రత్యేకము 1 దినము మర్దించి గుళికలు చేసి వాలుకాయంత్రమున 1 దినముండి తీసి అందు నాభి 27 తు॥ మందారము 6¾ తు॥ ముష్టిగింజల చూర్ణము 6¾ తు చేర్చి మరియు పాము కోడి అడవి పంది మొసలి దున్నపోతు మేక నెమలి ఎలుగుబంటి కోతి పెద్దపులి గుర్రము ఒంటె గాడిద లేడి దుప్పి నల్లత్రాచు మనుబోతు ఇర్రి జింక యెండ్రకాయ అడవికోడి ఆవు తాబేలు కొంగ బాతు కొంకనక్క ముంగి నక్క గుడ్లగూబ కణుసు చమరి ఎఱ్ఱనియిఱ్ఱి గ్రద్ద కప్ప ఏదుబంది పసడం డేగ నీరుకోడి మనుష్యుడు అనువాని చేదులను యథాసంభవముగ సంపాదించి చేర్చి దుష్టపుఱికను వెల్తురువేళ్లు నేలమ్రాకి వేళ్ళు వరగోగువేళ్లు చిత్రమూలము నిమ్మపండ్లు అను రసములతో మర్దించవలెను. దీనిని అడ్డికత్తు వరకు

వాడవచ్చును సమస్తసూతికారోగములు పోవును.

—♦ ఎఱ్ఱకుసుమమునకు భల్లాతామృతం. ♦—

5 తు॥ నల్లజీడిగింజలను ముక్కలుగానరికి 3 తు॥ నేతిలోవేసి వేయించినచో గింజలలోనిరసము నేతిలోనికిదిగును. గుల్లలను తీసివారవైచి యానేతిని కుంకుడుకాయంత ఉండను మ్రుగ్గిన అరటిపండు ముక్కలో పెట్టి తడిగుడ్డచుట్టి 4 జాములుంచి రోజుకు 2 సార్లు తినవలెను. రక్తప్రదరము తగ్గును. నిశ్చయము.

—♦ తెల్లకుసుమమునకు మహిసాక్షిగుటికలు. ♦—

మహిసాక్షి నల్లకాచు సమముగ గ్రహించి ముదురుమామిడిచెక్క రసముతో 20 దినములు మర్దించి ఇండుపుగింజలంతమాత్రలుచేసి ప్రాతకు 1 చొ॥ బొగడచెక్కరసముతోనిచ్చిన తెల్లకుసుమ నివారించు

—♦ మధుకాద్యవలేహము. ♦—

యష్టిమధుకము మంచిగంధము లక్కబియ్యము యెఱ్ఱకలువపూవులు రసాంజనము కుశవేరు వెల్లివేరు ముత్తవపులగపువేరు అడ్డసరపువేరు రేగుపండ్లగుజ్జు తామరపూవులు మారేడుచక్క బూరుగుజిగురు దేవదారుచక్క ఆరెపూవు అశోకపట్ట ద్రాక్షపండు దాసానిమొగ్గలు మామిడిచిగురు నేరేడు చిగురు నల్లకలువరేకులు పిల్లిపీచర నేలగుమ్మడు రజతభస్మము లోహభస్మము అభ్రికభస్మము విని



చూర్ణములు ప్రత్యేకము అరతులము చొ॥ గ్రహించి 32 తులముల పిల్లిపీచర స్వరసమునందు 26 తులముల పంచదారవేసి పాకముపట్టి అందుపై చూర్ణములుకలపి కలిసినతరువాత 4 తులముల తేనెగూడ చేర్చి కలియగలిపి దించేది. మోతాదు ప్రాతకు అరతులము. గుణము:—చిరకాలమునుంచి అనుగతమై బాధించు దారుణమై అసాధ్యమగు తెల్లకుసుమ యెఱ్ఱకుసుమ వివిధవర్ణ ప్రదరరోగములు యోనిశూలములున్నగు సకల యోనిరోగములను నివర్తించి ఆరోగ్యము నొసంగు పరమోత్తమ యోగము.

—♦ శిలాచూర్ణము. ♦—

తేనెరాయిని మెత్తగ చూర్ణించిన తెల్లని స్వచ్ఛమైన భస్మముగనుండును. ఈభస్మము 6 గుంజలెత్తు షడ్గుణసిందూరము 2 గుంజలెత్తు పటికబెల్లము 4 చిన్నములు, వెన్న అరతులము కలిపి ఒక మోతాదుగ దినమునకు రెండుసారులు ప్రాతస్సాయంకాలముల యందు సేవించుచున్న తెల్లకుసుమరోగము 11 దినములకు తప్పక నివర్తించును. ఇచ్ఛాపథ్యము. అనుపానములు:—ఉదయం కొబ్బరిపూవులరసము, సాయంత్రము ముదురు మామిడిచక్కరసము.

—♦ మరియొక యోగము. ♦—

మామిడిచక్క కాచు సమముగనూరి [illegible]

గింజలంతమాత్రలుచేసి దినమునకు మూడుచో॥ యిచ్చిన తెల్లకుసుమతగ్గును.

—♦ చికిత్సాంతరము. ♦—

పూర్ణచంద్రోదయమును గాని, షడ్గుణసిందూరమునుగాని, పూటకు అడ్డిగెత్తుచో॥ తిప్పసత్తు నాగకేసరాలు దాల్చినచెక్క అనువాని చూర్ణముతో నిచ్చిన గుణదాయకమగును.

—♦ పుష్యానుగచూర్ణము. ♦—

విషబొద్ది నేరేడుపప్పు మామిడిపప్పు రాతిపువ్వు రసాంజనము చిరుబొద్ది అరటిరసము సంబరేణు కుంకుమపువ్వు ఇంగువ అతివస మారేడు లొద్దుగ ముస్తలు గైరికము పెగ్గుమ్మడు మిరియాలు శొంఠి ద్రాక్ష రక్తచందనము పెదమాను కొడిశవిత్తులు తిప్పతీగ ఆరెపువ్వు యష్టిమధుకము మద్దిచెక్క సమముగచూర్ణించి తెనె బియ్యపు కడుగుతో సేవించిన రక్తార్శస్సు రక్తాతిసారము దంతములు పుట్టునపుడు బాలురకు గలుగు రోగములు, యోని రోగములు, రజోదోషము తెలుపు పాండువర్ణము యెరుపు నలుపు రంగులుగల స్రావము (కుసుమలు) నశించును.

—♦ పంచజీరకావలేహము. ♦—

జీలకఱ్ఱ బోడతరము ధనియాలు వాము రేగుపండ్లు సదాప నల్లజీలకఱ్ఱ ఇంగువ బడనిక పిప్పళ్ళు



మోడి అజామోదము నాయింట చిత్రమూలము ముస్తలు శొంఠి గజపిప్పళ్ళు జీలకఱ్ఱ ప్రత్యేకము 4 తు॥ చొప్పున చూర్ణించి 128 తు॥ పాలు, 64 తు॥ నేయి 200 తులముల బెల్లము కలిపి మందాగ్నిచే వండి లేహ్యపాకమున దించి సేవించిన గర్భహీనత 20 యోనిదోషములు, శ్వాసకాసలు, స్వరక్షయము, పాండువు, దుర్గంధము, మూత్రకృఛ్రి హరించును. బలము కలుగును.

—♦ ప్రదరారిలోహము. ♦—

కొడిశపాలచెక్క 400 తులములు గ్రహించి మెత్తగానలియగొట్టి ద్రోణప్రమాణ జలమందువేసి 8 వ వంతు మిగులునట్లుకాచి వడియగట్టి యాకషాయమునందు విషుక్రాంతి బూరుగుజిగురు పాత మారేడుపిండెలు తుంగముస్తలు ఆరెపూవు అతివస అభ్రిక సిందూరము లోహసిందూరము వీనిని ప్రత్యేకము 4 తు॥ చొ॥ చూర్ణించి చేర్చి గట్టిపడువరకు కాచి అణాయెత్తు మొదలు పావలాయెత్తు వరకు ప్రతి దినము సేవించునెడల తెలుపు నలుపు యెరుపు పసుపు రంగులుగల ప్రదరములు, కుక్షిశూల, కటిశూల, దేహశూల హరించును. ఆయువు పుష్టి బలము కాంతి జఠరము వృద్ధియగును. అనుపానము:— వట్టివేళ్ళ కల్కము చేర్చిన మంచినీళ్ళు (కల్కమనగా

నీళ్ళతో నూరిన ముద్ద).

—♦ ఋతుప్రవర్తినీగుటిక. ♦—

అన్నభేది వెలిగారము కాసీసము యింగువ ముసాంబరము చిత్రమూలము వీనిని కలబందరసముతో నూరి కుంకుడుగింజలంత మాత్రలు చేసి దినమునకు 2, 3 మాత్రలు యివ్వవలెను. అనుపానము:— నువ్వులు మెంతులు సదాపాకు వేపాకు వీని కషాయము. గుణము:— ఋతురక్తము జారీచేయును. రక్తగుల్మమును నశింపచేయును. పథ్యము:— పాలు అన్నము.

—♦ ఋతుబద్ధమునకు ప్రక్రియలు. ♦—

దాల్చినచెక్క వెలిగారము జీలకర్ర సమభాగముగ చూర్ణించి ¼ తు॥ చొ॥ సేవించినను పావురపురెట్టను తేనెతో నూరి కుంకుడు గింజలంత మాత్రలుచేసి సేవించినను ఋతుబద్ధము పోవును.

—♦ అశోకారిష్టము. ♦—

అశోకపట్ట 400 తులములు నలియగొట్టి 4 ద్రోణములనీటిలో వేసి 4 వ వంతుగ కాచి వడియగట్టి ఒకభాండమునబోసి అందు 800 తులముల బెల్లము, 64 తులముల ఆరెపూవు నల్లజీర తుంగముస్తలు శొంఠి మానుపసుపు నల్లకలువ త్రిఫలములు మామిడిజీడి తెల్లజీలకర్ర అడ్డసరపుచెక్క చందనము ఇవి



ప్రత్యేకము పలము చొ॥ చూర్ణించి చేర్చి మూతవేసి మాసము నిల్వయుంచి తీసి వడబోసి భద్రపరచవలెను. మోతాదు:— 1 తులము. కుసుమరోగముల నన్నిటిని హరించుటయేగాక జ్వరము రక్తపిత్తము అగ్నిమాంద్యము మేహము అరుచి గూడ నశింపచేయును.

—♦ సిద్ధప్రక్రియ. ♦—

యెలుకపెంటికలను తెచ్చి ఉదయ సాయంత్రములందు 2 చొ॥ ఆవుపాలతో 7 లేక 9 దినములు యిచ్చిన తెల్లకుసుమ నివర్తించును.

—♦ గర్భస్రావచికిత్స. ♦—

5, 6 నెలలయందు కడుపులో నొప్పిపుట్టి గర్భము పోవునను భయముకలుగునపుడు హారతికర్పూరము తులసియాకు సమముగ నూరి కుంకుడుగింజలంత మాత్రలు చేసి గంటకొకటి చొ॥ 4, 5 మాత్రలను చన్నీళ్ళతో యిచ్చిన గర్భము నిలచును.

—♦ ప్రసవకాలమున మావిపడిపోవుటకు. ♦—

శొంఠి పిప్పళ్లు మిరియాలు మోడి వెదురుపీచు వెదురుఆకు తెల్లతెగడ వీనిని సమభాగముగ నలియగొట్టి కషాయముగాచి 3 తులముల కషాయమును ఆవుపాలతో నూరిన సెనగ గింజలంత ముసాంబరపు మాత్రతో పుచ్చుకొన్నచో తత్క్షణము విరేచనమై మైలపోవును. కడుపునొప్పి తగ్గును. జ్వరముకూడ

నున్నయెడల మూసాంబరమునకు మారుగ కందిగింజంత వాతవిధ్వంసి నీయవలెను. పథ్యము:—పాలు.

—♦ అర్కపుష్పాదిమాత్ర. ♦—

తెల్లజిల్లేడుపూవురేకులు వేయించిన యింగువ మిర్యాలు యివి అరతులం చొ॥ తెచ్చి మెత్తగనూరి 2, 3 మాత్రలుచేసి ఒకపగటియందు లేక ఒక రాత్రియందు మ్రింగించవలెను. తప్పక మావిపడిపోవును. అపరిశుద్ధరక్తము జారీయగును. అనుభూతము.

—♦ ఋతుశూలకు చికిత్స. ♦—

(1) ఋతుమతియైన దినములందు 3 ఉదయపుపూటలు బేడెత్తు ఖురియపుచూర్ణము 1 తులము నేలయుసిరిగ రసముతో మ్రింగినయెడల తప్పక ఋతుశూల నివర్తించును. నిస్సంశయము.

(2) తుమ్మిపూవులు ¼ మిరియాలు ⅛ కలిపినూరి బహిష్ఠ 3 ఉదయములందు పుచ్చుకొనవలెను. పొంగునీళ్ళు, అన్నము.

(2) ⅛ తు॥ మిర్యాల చూర్ణమును కలిపి 1 తు॥ తురకవేపాకురసముతో కుంకుడుగింజంత రాసున్నమును వెన్నతో పొదిగి మ్రింగవలెను. 3 దినములు ఉదయములందు మాత్రమే. పథ్యము:—అన్నము పాలు.

—♦ సిందూరభూషణం. ♦—

కృష్ణాభ్రకము వెలిగారము గంధకము రససిందూ



రము సమభాగములు ఉమ్మెత్తవేరు రసమున నూరి మాత్రచేసేది. కందిగింజమాత్రను వాడిన గర్భిణుల జ్వరము, ఉష్ణము, మంటలు తగ్గును.

—♦ మహాసిందూరభూషణము. ♦—

సువర్ణము రజతము వజ్రము ప్రత్యేకము 2 తు॥ అభ్రకము, 8 తు॥ కాంతము, 8 తు॥ వంగము, 6 తు॥ సీసము, 8 తు॥ ముత్యము, 2 తు॥ పగడము, 2 తు॥ రససిందూరము, 8 తు॥ వీనిని జాజిపూలరసం ఎఱ్ఱ అగసిపూలరసం తెల్లచెరుకు పిల్లిపీచర కూతురుబుడమ కురువేరు నేలతాడి వట్టివేరు మల్లెపూవులు రసములతో మర్దించి పూటకు 2 గుంజలయెత్తు చొ॥ వెన్న తేనెతో వాడిన గర్భిణుల వేవిళ్ళు జ్వరము ఉష్ణము తగ్గును.

—♦ చంద్రాంశురసం. ♦—

శుద్ధరసగంధకములు అభ్రకము వంగము లోహము వీనిని సమభాగములుగ గ్రహించి కలబంద రసముతో 3 దినములు మర్దించి 2 గురివెందెత్తు మాత్రలుచేసి జీలకఱ్ఱ కషాయముతో సేవించుచుండిన స్త్రీగర్భస్థమగు జరాయుదోషము దారుణమైన యోనిశూల యోనియందు దురద మడపిచ్చ యోని ముసుగుకొని యుండక యెల్లప్పుడు విడబారి యుండుట తాపము మొదలగు బాధలు తగ్గిపోవును.

## మాదీఫలరసాయనము.

మాదీఫలరసము 64 తు॥ పటికబెల్లము 64 తు॥ దాల్చినచెక్క 5 తు॥ యాలకాయలు 2 తు॥ లవంగాలు 2 తు॥ ఆకుపత్రి తులం, శొంఠి 5 తు॥ నాగకేసరాలు 1 తు॥ చల్వమిరియాలు 1 తు॥ వట్టివేరు 2 తు॥ మిరియాలు 3 తు॥ ఈ 9 వస్తువుల చాతుర్భాగకషాయము 32 తు॥ వీనిని తేనెపాకముగ కాచి 3 తు॥ ల సైంధవలవణ చూర్ణమును కలిపి ⅛ తు॥ చొ॥ సేవించిన వాంతి అరోచకము పిత్తాతిరేకము ఉడుకు పొడిదగ్గు అజీర్ణము కడుపులోమంట తగ్గును.

పై విధముగ మాదీఫల రసమునకు బదులు నిమ్మపండ్లరసమునుచేర్చి పాకముచేసిన జంబీర రసాయన మనబడును.

## బాలసూర్యోదయము.

రసం 1 తు॥ గంధకం 3 తు॥ నాభి 3 తు॥ తామ్రం 2 తు॥ ఉక్కుభస్మం 2 తు॥ పొంగించిన యింగువ ½ తు అభ్రకము 5 తు॥ మిరియాలు 16½ తు॥ వీనిని మేడిచెక్క రసముతోగాని మామిడిచెక్క రసముతోగాని మర్దించి 1, 2, చిన్నములు సేవించిన శ్వాసకాసలు వాంతి పాండువు ప్లీహా ప్రమేహాము క్షయ మూలరోగము యోనిదోషము ప్రదరము మూత్రకృఛ్రి హరించును.



## ప్రతాపలంకేశ్వరము.

రసం, గంధకం, అభ్రకం ప్రత్యేకము 1 తు॥ లోహభస్మము 4 తు॥ ఆవుదూడ రేణమును కాల్చిన భస్మము 16 తు॥ మిరియాలు 3 తు॥ వత్సనాభి 8 తు॥ శంఖభస్మం 8 తు॥ వావిలియాకు రసముతో మర్దించి గురుజెత్తు మాత్రలుచేసి సేవించిన సూచికా, సర్వాంగ, శుష్క, పక్ష, బాహు, కంపవాతములును సన్నివాతములును కుదురును.

## ఫలకఘృతము.

త్రిఫలములు యష్టిమధుకము చంగల్వకోష్టు పసుపు మానుపసుపు కటుకరోహిణి వాయువిడంగాలు పిప్పళ్ళు ముస్తలు పెద్దపాపర కాయఫలము వస మేద మహామేద కాకోలి క్షీరకాకోలి నల్లసుగంధి తెల్లసుగంధి పేరింఖణము పెద్దసదాప ఇంగువ సన్నరాష్ణం చందనం రక్తచందనము జాజిపూలు తవక్షీరి కమలం చక్కెర అజామోదము దంతిమూలం ప్రత్యేకము 1 తు॥ గ్రహించి కల్కముచేసి జీవించిన దూడయు ఏకవర్ణముగల ఆవునేయి 64 తు॥ నేతికి 4 రెట్లు ఆవుపాలుచేర్చి సిద్ధపరచి ఘృతమును ⅛ తు॥ చొ॥ సేవించుచుండిన సంతతి కలుగును. పుట్టి నష్టమగు సంతానముగల స్త్రీలు సేవించిన సంతతినిలుచును.

— వంధ్యారోగములకు ఛాగలాద్యఘృతము. —

కొవ్విన మేకపోతు మాంసము 800 తు॥ బలామూలం 400 తు॥ పెన్నేరు 400 తు॥ మహాబల 400 తు॥ యీనాల్గు ద్రవ్యములును ప్రత్యేకముగ నాల్గురెట్ల నీళ్ళలోవేసి 4 వంతు మిగులునట్లు కషాయముకాచి వడియగట్టుకొనవలెను. (అనగా దేనికది వేరేవేరే కషాయములు కాచుకొనవలెను గాని అన్నియును కలిపి నాల్గురెట్లలోవేసి కషాయముకాచకూడదు.) ఇట్లు కాచినకషాయములను ఒక పెద్దలోహభాండమునవేసి అందు ఆవునెయ్యి 400 తు॥ పిల్లిపీచరరసము 480 తు॥ మునుబాల ఇప్పపట్ట ద్రాక్షపండు రెడ్డివారినానబాలు తామరపూవు తుంగముస్తెలు చందనము రాస్న ముయ్యాకుపొన్న కోలపొన్న బల సుగంధి పిల్లిపీచర నేలగుమ్ముడు పెన్నేరు కచూరములు పసుపు మానుపసుపు పేరింఖణము త్రిఫలములు నందివర్ధనము తాళీశపత్రి పద్మకము ఏలకులు ఆకుపత్రి నాగకేసరాలు జాజిపూవు ధనియాలు మంజిష్ట దానిమ్మబెరడు దేవదారు కూతురుబుడమ రేణుకలు వాయువిడంగాలు తెల్లజీలకర్ర కుంకుమపూవు ప్రత్యేకము 4 తు॥ కల్కముచేసి చేర్చి పక్వముచేసి వడియగట్టి భద్రపరచుకొని పూటకు ½ తు॥ చొ॥ పంచదారకలిపి సేవించుచుండవలెను. నష్టసంతానము



గల స్త్రీలకు, సంతానములేని వారలకు, గర్భస్రావముగల వారలకు యిది భూలోకామృతము. మరియు ప్రమేహము కష్టము క్షయ అపస్మారము వాతరక్తము మున్నగు రోగములను హరించును. కండపుష్టిచేయును. యిది పరమోత్తమమగు యోగము.

— వంధ్యాకర్కోటకి. —

గొడ్డాగారదుంపను తెచ్చి పైపొట్టును గీసివేసి చిన్నముక్కలుగ తరిగి యెండించి చూర్ణించి పూటకు బేడెత్తు చొ॥ దినమునకు రెండుసార్లు పుచ్చుకొనుచుండిన స్త్రీలకు సంతానము కలుగును. సంతాన నష్టముగల స్త్రీలకు సంతతి నిలచును. ఇది 3 మాసములవరకు మానక సేవించినగాని ఫలసిద్ధికానేరదు. వంధ్యాదోషములందిది చక్కగ పనిచేయును.

— కేసరచూర్ణము. —

పూటకు పావలాయెత్తు నాగకేసర చూర్ణమును ఆవుపాలతో ఋతుస్నాన దినము మొదలు 12 దినములవరకు పుచ్చుకొనుచున్న యెడల గర్భకోశము పరిశుద్ధమై గర్భధారణ శక్తివంతమగును.

— వంగభస్మము. —

నువ్వులపొట్టులో శుద్ధవంగపు రేకులను గ్రుచ్చెత్తి గోనిసంచిలోపోసి కుట్టి పుటమువేసినచో వంగపు రేకులు పేలాలవలె పొంగును. వానిని ఖల్వమునవూరి

వస్త్రగాలితము చేసికొన వలెను. యీభస్మము చి. ౦౹౨ కలుసదుంప చూర్ణము రెండుచిన్నవుల్లు కలిపి పంచదారకలిపిన బియ్యపుకడుగునీళ్ళతో పుచ్చుకొని న 11 పూటలకు తెల్లకుసుమ మానుమగును.

—♦ ఋతురక్తము జారీఅగుటకు. ♦—

నల్లనువ్వులు 5 మిరియాలు 5 కలిసి పూరె 6 మాత్రలుచేసి 3 దినములలో యిచ్చేది.

—♦ యోనిభ్రంశాదులకు పిచకారీ. ♦—

గవ్వపలుకు సాంబ్రాణి కరక్కాయ శిలాజితు మాచికాయ పటిక కాచు పోకకాయ పొగడచక్క తుమ్మచక్క పద్మకేసరములు పసుపు సమభాగము లుగ పన్నీరు మంచిగంధపు కషాయము కరక్కాయ కషాయము త్రిఫలకషాయము అనువానితో ప్రత్యే కము ఒకదినము మర్దించి కుంకుడుకాయలవలె మా త్రలుచేసి యుంచుకొని పూటకు ఒకటి నులువెచ్చని నీళ్ళలోకలిపి యోనియందు పిచికారీ చేయుచున్న యెడల యోనిభ్రంశ యోనిస్రవణము సంయోగమం దుబాధ దుర్గంధము తగ్గును. నిస్సంశయము.

—♦ గర్భిణుల జిగటవిరేచనములకు. ♦—

5, 6 మాసముల గర్భిణిగానుండునపుడు కొంద రస్త్రీలకు జిగట విరేచనములు రొమ్ము నొప్పికల్గిన తు. 1 జీలకర్ర, ½ తు॥ రసిసింధూరం మంచినీళ్ళతో



నూరి కుంకుడుగింజంత మాత్రలనుచేసి రోజుకు 2, 3 చొ॥ యిచ్చిన అట్టిబాధలు తగ్గును.

## సుఖరోగ ప్రకరణము.

—♦ సెగరోగము. ♦—

ఇది పసుపు తెలుపు ఎరుపు స్రావముకలిగి 3 విధ ములుగ నుండును. సెగరోగమనునది క్రూరమైనది.

—♦ ప్రమేహాంతక చూర్ణము. ♦—

తాళీశపత్రి తు ౧ యాలకకాయలలోని గింజలు తు ౧ గవ్వపలుకు సాంబ్రాణి తు ౧ పటిక, వెలిగా రం, సురాకారం 3 నుకలసి తు 1½ దాల్చినచక్క తు ౧ తిప్పసత్తు తు ౧ రేవల్చిన్ని తు ౧ సర్వసమం. తాటికలకండ వీనినెల్ల చూర్ణించి అందు 6 వ భా పచ్చకర్పూరము కలిపి గాజుబిరడాగల సీసాలో భద్ర పరచి ½ తు॥ చొ॥ తెల్లచక్కకేళి అరటిపండులోగాని గేదె వెన్నతోగాని మీగడతోగాని కలిపి రోజుకు 3 సార్లు పుచ్చుకొన్న 9 దినములకు చురుకు మంట పోటు మూత్రము చుక్కలుగ పడుట అతిస్రావము తగ్గును. పిదప యీచూర్ణమునచే బేడెత్తు చొ॥ 9 దిన ములును, అణాయెత్తు చొ॥ 9 దినములును పుచ్చుకొ నుచుండవలెను. నిశ్శేషముగ సెగరోగముమానును.

—♦ నూతనమైన సెగలకు. ♦—

శుద్ధయింగిలీకము అరతులము ముద్దశంకతికర్పూ

రము తులము తంగేడుయిగురు (మిక్కిలిలేతమొగ్గ) రెండుతులములు వీనిని మెత్తగనూరి కుంకుడు గింజలంత మాత్రలుచేసి రోజు 1 కి 4 మాత్రలు మంచి నీళ్ళతో సేవించిన 3 దినములకు తప్పక పచ్చసెగస్రావము మూత్రపు చురుకు మంట తగ్గిపోవును. నమ్మకమైన యోగము. ఇది ఒకనెలలోగా సంప్రాప్తమైన పచ్చసెగలకు మాత్రము నిస్సంశయముగ పనిచేయును

—♦ అభ్రికాదిచూర్ణము. ♦—

కృష్ణాభ్రకసిందూరం తు 1 వంగభస్మం తు 1 తిప్పసత్తు అరతులము, నాగకేసరాలు అరతులము, దాల్చినపట్ట అరతులము రేవల్చిన్ని తు 1 వీని చూర్ణమందు 2 తు॥ చందినీ అత్తరును ఒకతులం పచ్చకర్పూరమును కలిపి పూటకు 3 చిన్నముల చొ॥ రోజునకు 2 సార్లు సేవించవలెను. 10 దినములకు వ్యాధి నివర్తించును. కొందరకు చందినీఅత్తరు సరిపడక అజీర్ణము వాంతులుఅగుట కలదు. గనుక తత్వమునను సరించి వైద్యుడు వాడవలెను.

—♦ గోక్షురాదిక్వాథము. ♦—

ఏనుగుపల్లేరువేళ్ళు తంగేడుపువ్వు, తామరపూవు రేకులు కరకచిప్పలు గులాబీపూవు పాలసుగంధి నాగకేసరములు చలువమిరియాలు వీని కషాయము 4 తు॥ మహిసాక్షి ½ తు॥ చేర్చి ఉదయ సాయంకాలముల



యందు 10 దినములు సేవించవలెను.

—♦ తిక్తాదివటి. ♦—

నేలవేము కాసీసిందూరము సమముగ చందనీ అత్తరుతో నూరి శనగలంత మాత్రలుచేసి దినమునకు 3 చొ॥ సేవించవలెను. అనుపానం:—మంచిగంధము పల్లేరు పిండికొండ పాలసుగంధివేళ్లు చలువమిర్యాలు వీనికషాయము 4 తులములు.

—♦ సురాకారభస్మము. ♦—

చిన్నదూలగొండి అను చితుకదంచి తు 16 ల ముద్దలో 2 తులముల సురాకారపుగడ్డను పెట్టి మూకుళ్ళలో పెట్టి చీరచేసి 20, 25 పిడకలతో పుటము వేసి భస్మమును గ్రహించి 2 మొ॥ 4 వడ్లగింజలయెత్తు పంచదారతోగాని ఉలిమిరిచెక్క రసముతోగాని యిచ్చిన సెగరోగమునందలి మూత్రపు చురుకు మూత్రకృచ్ఛ్రి తగ్గును.

—♦ గుగ్గులుచూర్ణము. ♦—

రాస్నాపురిగుగ్గిలం $\frac{1}{8}$ తు॥ పటికిబెల్లం $\frac{1}{8}$ తు॥ వీనిని మర్రిపాలతో తడిపి మింగేది. రోజుకు 2 సార్లు 9 రోజులు చాలును. పచ్చసెగ సవాయిపుండ్లు భగందరము మానును.

—♦ చంద్రప్రభావటి. ♦—

బావంచాలు వస తుంగముస్తలు నేలవేము దేవ

దారుచక్క పసుపు అతివస మానుపసుపు పిప్పలి మోడి చిత్రమూలము తెల్లతెగడవేరు దంతిమూలము ఆకుపత్రి దాల్చినచక్క ఏలకులు తవక్షీరి ధనియాలు త్రిఫలములు చవ్యము వాయువిడంగాలు గజపిప్పళ్ళు స్వర్ణమాక్షిక భస్మము మిర్యాలు యవక్షారము సర్జక్షారము సైంధవలవణము సౌవర్చలవణము బిడలవణము ప్రత్యేకము 1 తు॥ లోహసిందూరము తు 2 పంచదార తు 4 కర్పూరశిలాజిత్తు తు 8 మహిసాక్షి తు 8 మహిసాక్షిగాక తక్కిన అన్నిటిని మెత్తనిచూర్ణముచేసి మహిసాక్షిని నీళ్ళలోవేసి పాకముగకాచి అందు పైచూర్ణములువేసి గలిపి మర్దించి శెనగలంత మాత్రలుచేసి సేవించవలెను. గుణము:— మేహము మూత్రకృఛ్రి అశ్మరి మూత్రాఘాత అండవృద్ధి పాండురోగము కామిల హలీమకము శ్వాసకాసలు కుష్టము అగ్నిమాంద్యము అరోచకము హరించును. జీర్ణించిన సెగరోగములు కలవారు మండలము దినములు సేవించిన రోగము నివర్తించుటయేగాక ఆయువుపుష్టి కాంతి బలము శుక్రము వృద్ధియగును.

### —♦ మేహమిహిరతైలము. ♦—

మారేడు తక్కెడ దుందిలము పెగ్గుష్మిడు కలిగొట్టు యాచెట్ల వేరుపట్టలు ఉశిరిగపట్ట దానిమ్మపట్ట యివియెల్లగలిసి 400 తులములు నలియగొట్టి



ద్రోణప్రమాణ జలమునవేసి 4 వ వంతుగ కాచి వడియగట్టి ఆకషాయమునందు 64 తులముల నువ్వుల నూనె, 64 తు॥ ఆవుపాలు, నేపపట్ట నేలవేము పల్లేరు దానిమ్మపట్ట రేణుకలు మారేడువేరు దేవదారుపట్ట మానుపసుపు తుంగముస్తలు త్రిఫలములు గ్రంధి తగరము ద్రాక్ష నేరేడుపట్ట మామిడిపట్ట వట్టివేరు వీని సమభాగకల్కము నూనెకు నాల్గవవంతు చేర్చి వండి వడియబోసి మర్దనమున కుపయోగించునది. శిశ్నము వృషణములు పొత్తికడుపు ఈభాగములయందు మర్దించిన కష్టముగ స్వల్పముగ వెలువడు మూత్రమును ధారాళముగ వెడలజేయును. చురుకు మంట తగ్గించును. అరకాళ్ళు అరచేతులు శిరస్సు వీనియందుకూడ మర్దనచేసిన కాలు చేతులుమంట తలదిమ్ము తగ్గును. శిశ్నమునకు మర్దనము చేసిన అమితసంభోగముచేగాని సెగసవాయిలు జీర్ణించుటచేగాని కలిగిన లింగదౌర్బల్యము శుక్రక్షీణత సంభోగమునందశక్తత లేపనశక్తితగ్గియుండుట నశించును.

### —♦ జీర్ణించినసెగలకు మహాభ్రవటి. ♦—

31 సార్లు గుంటగలగరరసముతో భావనచేయబడిన కృష్ణాభ్రకము పాదరసము గంధకము లోహము ఒక్కొకభాగము అభ్రకములో సగము బంగారు భస్మమును చేర్చి త్రిఫలకషాయముతో నూరబడిన

ములు మర్దించి గురివెంద్రగింజలంత మాత్రలుచేసి రోజుకు 2 చొ॥ వాడిన యెన్ని సంవత్సరముల నుండి జీర్ణించిన సెగరోగములైనను ఒక మండలము లేక రెండు మండలములకు పూర్తిగా నివర్తించి సంభోగ శక్తిని ఆయువును బలమును పుష్టిని కలుగజేసి ఆరోగ్యము నొసంగును.

### —♦ తెల్లసెగకు శిలాజిత్తుభస్మము. ♦—

శిలాజిత్తుభస్మము 2 చి॥ తిప్పసత్తు 2 చి॥ వీనిని పటికబెల్లము లేక వెన్న అనుపానముగ బుచ్చుకొనిన తెల్లసెగ మానును. ఇది ఒకమోతాదు.

### —♦ త్రిఫలాగుగ్గులు. ♦—

మేకపాలతో కన్యకోమలిదుంపను తొక్కి రసము తీసి దానితో "త్రిఫలాగుగ్గులు"ను సేవించినయెడల తెల్లసెగహరించును. త్రిఫలచూర్ణము 1భా॥ మహిసాక్షీ 2భా॥ కలిపిమాత్రచేసిన త్రిఫలాగుగ్గులనబడును.

### —♦ స్వర్ణవంగము. ♦—

నవాసాగరం, రసం, గంధకం, తగరం వీనిని సమ భాగములుగ గ్రహించి ముందుగా వంగమును కరిగించి రసములోపోసి మంచినీళ్ళతో నూరుచు నల్లనీరు పోవునట్లు చేయవలెను. పిదప గంధకమును నవాసాగరమును కలిపి నూరి మూకుడులోపోసి ఒక మూకుడును పైనబోర్లించి దానిమధ్యసన్న నిరంధ్రము



చేసి చీరజేసి పొయిమీదబెట్టి నాలుగు జాములు వండేది. ఇనుపకడ్డివేసి చూచుచు బంగారువన్నె వచ్చినపుడు ఔషధము పక్వమైనట్లు తలచి దించి స్వాంగశీతలమున విప్పి అడుగుమూకుడులో అపరంజి రేకులవలె నుండు ఔషధముతీసికొని క్రిందనుండు పిట్టును తీసివేయవలెను. ఏలక్కాయలు లవంగాలు తవక్షీరి తిప్పసత్తు నాగకేసరములు అనువాని సమభాగచూర్ణము 3 చిన్నములు మందు 1 చిన్నము కలిపి ఉదయ సాయంకాలముల యందు సేవించుచుండిన ప్రాతసెగలు తత్సంబంధమైన ఇంద్రియనష్టము కాళ్లులాగుట మున్నగు వికారములు తగ్గును.

### —♦ తామలక్యాదిచూర్ణము. ♦—

నేలయుసిరిగఆకు తిప్పసత్తు నాగకేసరములు మద్రియూడలచిగుళ్ళు చలవమిరియాలు సమముగ చూర్ణించి పంచదారతో $\frac{1}{8}$ తు॥ చొ॥ 3 పూటల పుచ్చుకొనుచున్న 15 దినములకు తెల్లసెగ మానును.

### —♦ రక్తసెగలకు. ♦—

విషముష్టి గింజలను కాంజికములో 3 దినములు నానబెట్టి పైపొట్టును తీసివేసి యాగింజలను కాల్చి మసిచేయవలెను. దానిని పూటకు బేడెత్తుచొ॥ తరవాణితో పుచ్చుకొనిన ఎర్రసెగ తప్పక 3 రోజులలో మాయమగును. పథ్యము:-తరవాణి అన్నము.

### రక్తసెగలకు మరియొకయోగము.

తిప్పసత్తు వంగము పన్నీరుదుంప తంగేడుపూవు ప్రత్యేకము తు 2 పంచదార అర్ధశేరు వీనిని కలిపి పూటకు తు 1 చొ॥ 15 దినములిచ్చిన శిశ్నమువెంట రక్తముపడుట తగ్గును.

### దాడిమాదిపానకము.

దానిమ్మవేరు, దానిమ్మపట్ట, దానిమ్మఆకు, దానిమ్మపండు, దానిమ్మపూవు యివి ప్రత్యేకము 16 తు॥ చొ॥ నలియగొట్టి 8 రెట్లనీటిలోవేసి 4 వ వంతుగ కాచి వడియగట్టి దానికి రెట్టింపు పటికిబెల్లము చేర్చి తేనెపాకముగ కాచి దించి భద్రపరచుకొనేది. ½ తు॥ లో అణాయెత్తు కతీరాగోదుకలిపి త్రాగిన మూత్రనాళమునుండి పడు రక్తము తక్షణముకట్టును. మూత్రముతో కలసి స్రవించు రక్తమును ఆపును.

### రక్తసెగకు సులభచికిత్స.

మర్రిపండ్లు మంచిబెల్లము సమముగనూరి కుంకుడుగింజలంత మాత్రలుచేసి 1 రోజులో 5 లేక 6 మాత్రలవరకు యిచ్చిన రక్తసెగ నివారించును.

### సర్వసెగలకు సామాన్యచికిత్స.

తంగేడువిత్తులు తెల్లజీలకర్ర నల్లజీలకర్ర వీనిని వేయించి చూర్ణించి 2 రెట్లు పటికబెల్లముకలిపి తేనెతో సేవించిన సెగలు మానును. ఇది తెల్లసెగ శుక్ల



నష్టములకును మంచిది.

### సెగరోగమందు పథ్యములు.

మజ్జిగ పులుసు అనపకాయ గేదెపెరుగు చద్ది అన్నము పెరుగుతోటకూర బీరకాయ నెయ్యి దోసకాయ పెండలము పానకము మేకమాంసము మినపకుడుము నిమ్మకాయ దబ్బకాయ ఉశిరిగపండ్లు వీని ఊరుగాయలు లేక పచ్చడులు ఇవి పథ్యమైనవి.

### అపథ్యములు.

గోరుచిక్కుడుకాయ ఆవ గోంగూర కంద నూనె మట్టుబచ్చలి ఆవుపాలు టీ కాఫీ సంభోగము సారాయి ఉలవచారు మెంతిమజ్జిగ కాకరకాయ వెల్లుల్లి కోడి జీడిమామిడిపప్పు మొదలగునవి.

### వరిబీజము.

సెగరోగి అంగమునుండి స్రవించు విషద్రవము కొందరకు ఒక వృషణమునకును కొందరికి రెండు వృషణములకును దిగి వాచును. వేఱుంటికి ఒకరికి కాలిలోనికిగూడ దిగి బాధించును. ఇది వరిబీజము.

### 1 చికిత్స.

లేతకొబ్బరిని కోరి ఆముదముతో నుడికించి కట్టు కట్టినచో తప్పక వాపుతగ్గి బాధ శమించును.

సోమింతాకునుగాని, గచ్చచిగుళ్ళనుగాని, బంతియాకునుగాని, ఉత్త బుర్రగుంజనుగాని, మునగచిగు

ళ్ళనుగాని తొక్కి ఆముదముతో నుడికించి నులువెచ్చగానున్నపుడు కట్టుగట్టవలెను. ఇవియును రోజునకు 3 సార్లు చొ॥ 3 దినములు కట్టిన తగ్గును.

నల్లఈశ్వరి కాగ్నినుగు వీనివేళ్ళు గచ్చపప్పు గురవెందపప్పు వీనిని అరగదీసి యాగంధమున పొంగించిన వెలిగారమును కొద్దిగాకలిపి గుడ్డకు పట్టించి అంటించిన యెడల వాపుతగ్గును.

బూడిదగుమ్మడికాయను కోరి కట్టుకట్టిన యెడల బాధ వాపుతగ్గి సుఖమగును.

పథ్యం:—కందిపప్పు మెంతిమజ్జిగ తరవాణి బీరకాయ పొట్లకాయ చిర్రికూర. అపథ్యం:—పెసరపప్పు పెరుగు మినుములు సెనగలు నూనె.

## —♦ సవాయిరోగము. ♦—

ఇది వ్యాధిగ్రస్తమైన స్త్రీలతో భోగించుటచేతను అట్టివారి దర్శన స్పర్శన ఆలింగనాదుల చేతను ఒకరినుండి మరియొకరిని ఆవహించు పెద్దపిశాచము సుఖరోగములలో నన్నిటికంటె మిక్కిలిగా శరీరారోగ్యమునకు భంగము గలిగించునది సెగరోగమైనను దానికంటె సవాయివ్యాధి భయంకరమైనది. ఇది వివిధమైన వికారములతో మనుజుని లింగము నాలుక పెదవులు ముక్కు చెవులు కన్నులు వేళ్ళు గజ్జలు అను అవయవములందు ప్రత్యక్షమగును.



వికారములనుబట్టి దీనిని 14 విధములుగ ప్రకృత వైద్యులు నామకరణము గావించుచున్నారు.

ముఖమంతటను మొటిమలు జనించుట లింగము యొక్క పైనగాని చర్మములోపలగాని పొక్కులు జనించి దుర్వాసన పోటు గలిగియుండుట జ్వరము ఈచిహ్నములుకలది పొక్కుసవాయి.

లింగము చివరచర్మము లోపల బొగడమీద దురదగలపొక్కులు బుట్టి నలిపినకొలది రసికారుచు కొంచెముగవాచి తీపు పోటు గలిగించును. చర్మమంతయు పగులును. దీనిని చిడిపిసవాయి అందురు.

పై లక్షణము లన్నియు గలిగి స్వల్పమైన రసికలది అంటుసవాయి. ఇది గలవారి మూత్రములో ఉచ్చపోసిన సంక్రమించును.

అంగముచివర ప్రథమమున చిట్టిగాని చిన్నపొక్కు లేచిగాని క్రమముగ చర్మమెల్ల కుళ్ళుచు లింగమును కొరికివేయును. ఇది కొరుకుసవాయి.

సంభోగానంతరమున లింగమును కడగకపోవుట వలన దురద అమితదుర్గంధము గలిగి బాధించు పొక్కులు గలిగిన నది రొచ్చుపొక్కు సవాయియనబడు.

మూత్రనాళమున కోడిజుట్టువలె మాంసముపుట్టి అంగమంతటను దురద పొక్కు కలిగియున్న నది కోడిజుట్టు సవాయి యనబడును.

అంగముచుట్టు చర్మములోపల అనగిజలవంటి పొక్కులు మిక్కుటముగాలేచి దురద గలిగి యుండి లింగము గట్టిగానలిపినట్లో మనల పొక్కులు చితికి యెప్పటివలె నుండునది ఆకుసవాయి.

కాలిన పొక్కుబోలె లింగముమీద నొక్కకురుపులేచి దాని రసితగిలినచోటనెల్ల అట్టిపొక్కులే బయలుదేరుచున్నయది నరుసపొక్కుసవాయి యనబడును.

పోకమీద పాకుపట్టి కురుపుగలిగియుండి మైథునమున స్త్రీ యోనియందు మంట గలుగజేయుట రొమ్ము సవాయికి రూపము.

శరీరమంతటను దురద రసిగల కాయలవంటి పొక్కులులేచినది కాయసవాయి యనబడును.

శరీరమంతటను కాలిన పొక్కులవలెగాని నల్లని మచ్చలుగాని చిరుగుడుగువలె పక్కులులేచుట గాని కలిగి అంగముపై కురుపుగల్గిన బగ్గిసవాయి.

ఒకగడ్డలోగాని, రెండు గడ్డలలోనుగాని, గుండ్రముగను, లేక నిలువుగను, లేక అడ్డముగను బయలుదేరు వాపునకు సవాయి బిళ్ళలనియు, నడికెగడ్డలనియు, అడ్డగర్రలనియు క్రమముగాపేర్లు.

—♦ సవాయికి శోధనక్రియలు. ♦—

సవాయిరోగము తగిలిన వెంటనే ఆముదమును వెచ్చచేసి అందు చిన్నముక్కగ (కాలిమెల్) రసభ



స్మముకలిపి విరేచనము చేయించుటత్యావశ్యకము. అనంతరము జిల్లేడు, మఱ్ఱి, జువ్వి, రావి, మేడి పట్టల కషాయముతో కురుపులుగల ప్రదేశమునందు ప్రతిదినము రెండుసారులు కడుగుటయు స్నానము చేయించుటయు ప్రతిదినము చేయదగినపని. పిదప పుచ్చుకొనదగిన మందును వ్యాధి వయస్సు బలము చూచి వాడవలెను.

—♦ ఉప్పంఘారసము. ♦—

రసభస్మము పాము వెల్లుల్లి మహిసాక్షి తెల్లకాచు ప్రత్యేకము 7 చిన్నములు గ్రహించి మెత్తగా నూరి వీనికి అన్నిటికి సమము అనగా 35 చిన్నములు పాతబెల్లమునుచేర్చి మరలమర్దించి యీమొత్తపు మందును 14 మాత్రలుగచేసి ఉదయ మొకటియు, సాయంత్రము నొకటియు 7 దినములు సేవించి 9 వ దినమున అభ్యంగనము చేసుకొని నలువది దినముల వరకు కందిపప్పు అన్నము రొట్టె ఘోంగుసీళ్ళు తప్ప మరియేమియు భుజింపక మిక్కిలిగాలి యెండతగులకుండ బ్రహ్మచర్యము మొదలైననియమముతో నుండినయెడల సవాయిరోగములు నివర్తించుటయేగాక అసాధ్యములగు వ్రణములు గుల్మములు సంజా శ్వాస కాస మొదలగువానిని సహా వారింపజేయును.

జ్ఞాపిక:—ఈమందు సేవించుట వలన రోగము పట్టును. గనుక ఒకదినము విడచి రెండవ దినమున మాత్రలను ఆముదములో ముంచి అ-గుటిలో వేసికొని మ్రింగుచుండిన యెడల రోగము పట్టదు. అపథ్యదోషము గలిగినయెడల కీళ్లుపట్లువిడచును. మహారోగములను గలిగించును గనుక జాగ్రత వహింపవలెను.

—♦ నారశింహచూర్ణము. ♦—

పిల్లిపీచరచూర్ణము 64 తు॥ ఏనుగుపల్లేరు సమూల చూర్ణము 64 తు॥ నేలతాడి చూర్ణము 80 తు॥ తిప్పసత్తు 100 తు॥ నల్లజీడిగింజల చూర్ణము 128 తు॥ చిత్రమూలము 40 తు॥ పైపొట్టు తీసిన తెల్లని నువ్వులు 64 తు॥ శొంఠి పిప్పలి మిరియాలు మూడునుకలిసి 32 తు॥ చక్కెర 280 తు॥ తేనె 140 తు॥ నేయి 70 తు॥ నేలగుమ్ముడుచూర్ణము 64 తు॥ వీనినన్నిటి నేకముచేసి నేతితోమాగిన కుండయందుంచుకొని పూటకు అరతులం మొదలు 1 తులమువరకు సేవించవలెను. ఇట్లు 40 దినములు సేవించిన 11 విధముల సవాయిరోగములు మేహము పాండువు పీనస ఆఢ్యవాతము 18 కుష్ఠురోగములు 8 విధముల ఉదరరోగములు భగందరము మూత్రకృఛ్రి గృధ్రసీవాతము హాలీమకము క్షయ శ్వాస కాసలు 80 వాతములు 40 పైత్యములు 20 శ్లేష్మరోగములుహరించును శరీరమునకు మంచి తేజస్సు బలము కలుగును. వీర్యము వృద్ధియగును. నేత్రములకు దృష్టి



బలము హెచ్చును. ఇది మాయనుభవమున అఖండ వీర్యవంతమై పనిచేయుచున్నది ఈయోగము వ్యాధికారమున చెప్పబడిన దైనను యోగప్రభావముచే పై రోగములను హరింపగలదిగ నున్నది. పథ్యము:—పెరుగు నేయి అన్నము గోధుమరొట్టె బీరకాయ పొట్లకాయ కందిపప్పు మెంతివజ్జిగ మొదలైనవి.

—♦ పటోలాదఘృతము. ♦—

చేదుపొట్ల అడ్డసరము నేలవేము వేపవేరుచక్క కటుకరోహిణి త్రిఫలములు చిత్రమూలము వీనిని సమభాగములుగ గ్రహించి వీనికి 8 రెట్లు నీరుబోసి 4 వ వంతు మిగులునట్లుకాచి వడియగట్టి అందు 4 వ వంతు పాతనేయిచేర్చి తెల్లతెగడ దాల్చినచక్క నాగకేసరములు వాయువిడంగములు అనువాని కల్కము నేతికి 4 వ వంతుచేర్చి సంప్రదాయానుసారముగ కాచి దించి వడకట్టి భద్రపరచుకొని పూటకు తులమెత్తు చొ॥ సేవించిన సాధారణమైన సవాయిలు కుదురును. కొంతకాలము జీర్ణించిన వ్యాధులకిది యమోఘముగ పనిచేయును.

—♦ షట్పలగంధక చూర్ణము. ♦—

అష్టశుద్ధులు గావింపబడిన గంధకము 6 తు॥ త్రిఫలములు త్రికటుకములు వాయువిడంగాలు యాల

కుంకు, కస్తూరి, దాల్చిన తిగలు నల్లజీడిగింజలు జీల కర్ర వీని యన్నిటిచూర్ణము కలసి 6 తు॥ చిత్రమూల చూర్ణము 1 తు॥ వీనినేకముచేసి ప్రాతః 1, 2, 3 వరహాలయెత్తు పరకు తేనె వెన్న వేడినీరు అరటిపండు చక్కెర నెయ్యిమొదలగు దేనితోనైన రోజుకు 2 సార్లు సేవించవలెను. పథ్యం:—పాలు అన్నము. గుణము:— అన్నివిధముల సవాయిలు మానును. 18 కుష్టులు చర్మరోగములను నిస్సంశయముగ మాన్పును. సంభోగశక్తినిచ్చును.

—♦ భల్లాతకతైలము. ♦—

చక్కగాపండి రాలిన శేరు నల్లజీడిగింజలను గోనెపట్టపై బాగుగరాచి నిమ్మపండ్ల రసములో 2 దినములు నానబెట్టి తీసి కడిగి ముక్కలుగొట్టి పావు శేరు నేతిలోవేసి బాగుగా వేయించవలెను. గింజలనుండి రసము నేతిలోనికి జేరును. పిదప గుల్లలనుతీసి పారవైచి యాఘృతమును భద్రపరచుకొని అందు తిప్పసత్తు చిత్రమూలము త్రిఫలములు వాయువిడంగములు నాగకేసరములు కుంకుమపువ్వు అనువాని చూర్ణమును నాల్గవవంతు కలిపి కుంకుడు కాయంత మాత్రను చక్కెరకేళి అరటిపండులో పొదిగి దానిపైన తడిగుడ్డను చుట్టి నాల్గుజాములుంచి పిదప పండుసహా మింగవలెను. ఇట్లు దినమునకు 2 పర్యాయ



ములు పుచ్చుకొనుచున్న 20 దినములకు సవాయిమేహమువలన గలిగిన సమస్తవికారములు మచ్చలు దద్దులు తిమ్మిరలు అరచేతులు పగులుట శరీరమున కంబుసము విడచినట్లుండుట నివర్తించును. పులుసు. నూనె కూడదు.

—♦ గంధకాదిగుటికలు. ♦—

గంధకము ఫిరంగిచెక్క నల్లజీడిగింజలు ముష్టివిత్తులు ఇవి సమభాగములు, వీనిని చిత్రమూలము తెల్లబాడిదచెక్క చిట్టిగారివేరు నిమ్మపండ్లు అను వానిరసములతో నొక్కొక్కదినము బాగుగా మర్దించి గురుగింజంతమాత్రచేసి దేహబలానుసారముగ సేవించిన కురుపులు వాతపునొప్పులు కుదురును.

—♦ ఇంగిలీకమైనము. ♦—

ఊరకల్లు శేరు, కోడిగ్రుడ్లలోని తెల్లసొన పావు శేరు వీనినొక క్రొత్తకుండ పెంకులో పోసి అందు 1 పలము ఇంగిలీక చూర్ణమును వేసి ద్రవమిగురువరకు కాచేది. మొత్తగానూరి పెసరగింజలంత మాత్ర చొ॥ సేవించిన సవాయిలు కుదురును. పులుసు వర్జ్యము!

—♦ చిత్రకాదిగుటికలు. ♦—

పచ్చిచిత్రమూలం తు 5 నల్లజీడివిత్తులలోని గుంజు పావుతులం శుద్ధతాళకం పావుతులం వాముపొట్టు తు 2 ఎండుకొబ్బరి ఒకతులం యీవస్తువులను ఆవు

నేతితో నూడి 15 మాత్రలుచేసి ప్రాతకు ఒక మాత్ర చొ॥ యిచ్చిన సవాయి కుదురును.

### —♦ చిలిపిసవాయికి మరిచాదిచూర్ణము. ♦—

మిరియాలు ½ తు॥ రసకర్పూరం ½ తు॥ రత్నపురిగుగ్గిలం ½ తు॥ లవంగాలు 1¼ తు॥ ఫిరంగిచెక్క 24 తు॥ కరక్కాయ 1 తు॥ చూర్ణించి ప్రాతకు ¼ తు॥ చొ॥ సేవించిన చిలిపిసవాయి నెలకు కుదురును.

### —♦ భల్లాతకాదిమోదకము. ♦—

నల్లజీడిపిక్కలు కచ్చా పావుశేరు, ఎండుకొబ్బరి పక్కా అర్ధశేరు, ఫిరంగిచెక్క పక్కా అర్ధశేరు, నల్లమందు 2 చిన్నములు, పంచదార పక్కా సవాశేరు, పసుపుకొమ్ములు 2 డబ్బులెత్తు వీనిని దంచి ఉసిరిగకాయలంత మాత్రలుచేసి రోజుకు 1 చొ॥ 10 దినములు పుచ్చుకొనిన సవాయిలు కుదురును మందుతినిన వెంటనే తాంబూలం వేసికొనవలెను. చప్పిడిపథ్యం.

### —♦ సవారోగకుఠారరసము. ♦—

రసం 1 తు॥ ఇంగిలీకము అరతులం, మైలతుత్థం 1 తు॥ మృద్దారుశృంగి 1 తు॥ బాలింతపోలు 1 తు॥ లవంగాలు 1 తు॥ జాజికాయ 1 తు॥ వీనిని 125 నిమ్మపండ్లతో మర్దించి గుంజెత్తు మాత్రలుచేసి రోజుకు 2 మాత్రలు యిచ్చేది. సవాయి కుదురును. పద్యం:—కందిపప్పు వేచినఉప్పు కాల్చినమిరపకాయ.



### —♦ సవారోగకులాంతకరసం. ♦—

రసం గంధకం లవంగాలు సమముగ గ్రహించి తమలపాకురసముచే మర్దించి తెల్లపట్టుగుడ్డలో చుట్టి పుటపాకముచేసి పిచ్చికుసుమ (స్వర్ణక్షీరి) రసముతో మర్దించి సెనగగింజలంత మాత్రలుచేసి రోజుకు 2 మాత్రలు చొ॥ 15 దినములిచ్చేది. తరుణమందున్న సవాయి కుదురును. చప్పిడిపథ్యం.

### —♦ బిళ్ళలు అడ్డుగర్రలు వడిసెగడ్డలు వీనికిపట్టు. ♦—

తక్కెడాకుపసరుతో గురివెందగింజపప్పును అరగదీసి ఆగంధమునందు కొద్దిగా పొంగించిన వెలిగారమును కలిపి పలచని గుడ్డను పట్టించి పట్టీవేయవలెను. నూతనముగా బయలుదేరు సవాయి గడ్డలన్నియు కాగి తప్పక హరించిపోవును.

### —♦ మరియొకవిధము. ♦—

తులము మైనమునుకరిగించి అందు ఉల్లిపాషాణము ¼ తు॥ చూర్ణించి కలియబెట్టి దించి గుడ్డకురాచి ద్దిగా వెచ్చజేసి పట్టీవేసినయెడల గడ్డలు కరుగును.

### —♦ పక్వదశయందున్న బిళ్ళలకు చికిత్స. ♦—

హరించుటకు వీలులేనిచో నల్లజీడిని గాని చిత్రమూలమునుగాని వేసి పుండుజేసి పిదప వరపిండి ఉడికించి ఆముదముకలిపి వెచ్చగానుండునప్పుడు కట్టుకట్టినయెడల చీము ఒడిసిపోవును. పిదప మైలతుత్థము

గంగసిందూరము ప్రత్యేకము $\frac{1}{2}$ తు॥ గుగ్గిలము 4 తు॥ చిట్టాముదములో నూరి వెచ్చజేసి పట్టువేసిన మానును.

జ్ఞాపిక:–గడ్డలు అంకురించిన వెంటనే లేతతాటికమ్మను కుమ్ములోపెట్టి వెచ్చగానున్నప్పుడే గడ్డలు కలచోట కాపవలెను. ప్రతిదినము 4, 5 సారులు కాపవలెను పట్టీవేసినను పైన కాపవచ్చును. దీనివలన శీఘ్రముగ కాగిపోవును. విరేచనము జేయించుట మంచిది.

—♦ సవాయిపుండ్లకు మలామా. ♦—

జంగాల్‌పచ్చ $\frac{1}{4}$ తు॥ మేకకొమ్మిప్ప $\frac{1}{4}$ తు॥ దొండాకుపసరు 6 తు॥ ఇవన్నియు నూరి గుడ్డకు పట్టించి వేసినను లేక పూసినను సవాయిపుండ్లు మానును.

—♦ గంధాదిలేపము. ♦—

అమరశిల గంధకము పోకకాయ మైలతుత్థము తెల్లకాచు ఇంగిలీకము గంగసిందూరము వీనిని వెన్నపూసతోగాని ఆముదముతోగాని పుండ్లపై లేపము చేయవలెను.

—♦ లేపము. ♦—

లవంగాలు 50, తెల్లకాచు పచ్చిపోకకాయ రససిందూరము ప్రత్యేకము $\frac{1}{4}$ తు॥ కాకరఆకు పసరుతో మర్దించి కొరుకుపుండునకు రాచినచో మానును.

—♦ సవాయిపుండ్లకు మరియొకమలామా. ♦—

ఇంగిలీకము రసకర్పూరం జంగాల్‌పచ్చ గంగ



సింధూరము మైలతుత్థం మృద్దారుశృంగి పోకకాయ సమభాగములుగ గ్రహించి వెన్నతో నూరి సవాయి పుండ్లకు పూసిన దురద పుండు మానును.

—♦ కజ్జలిచూర్ణము. ♦—

రసగంధకములను సమభాగముగ మర్దించి యాకజ్జలిని నీరుగారునట్టి పుండ్లపై చల్లుచున్నయెడల నీరుగారుట తగ్గి క్రమముగ మానును.

—♦ మరియొకలేపము. ♦—

రసము గంధకము రసకర్పూరము మృద్దారుశృంగి జంగాలపచ్చ మైలతుత్థము పాలతుత్థము సమముగ తులసితో నూరి పుండ్లకు పూయవలెను.

రసకర్పూరమును నిమ్మకాయ రసములో నూరి జర్మన్ సిల్వర్ రేకునకు పూసి ఆరనిచ్చినచో ఆరేకు తెల్లని చూర్ణమగును. దానితో కాచు కరక్కాయ కలిపి పుండ్లకు రాచిన శీఘ్రముగ పుండ్లు మానును.

—♦ వేరొకయోగము. ♦—

రసకర్పూరం మైలతుత్థము మృద్దారుశృంగి జంగాల్‌పచ్చ పాలతుత్థం సమముగ నూరి వెన్న గుంటగలగరాకు పసరు కలిపి పుండ్లకు పూయవలెను.

—♦ మహాభల్లాతకీలేహ్యం. ♦—

జీడిగింజలు 4 ప్రస్థములు ముక్కలుగా నరికి 2 ప్ర॥ నీటిలోవేసి 8 వ వంతుగగాచి వడియగట్టి అందు

4 ప్ర॥ ఆవుపాలు 6 ప్ర॥ పంచదార 6 ప్ర॥ నేయి కలిపి సన్ననిమంటతో కాచుచు తెల్లఉప్పి నల్లఉప్పి చిత్రమూలం గ్రంథితగరం (నేలమర్రి నేలతిప్పెట అని గ్రంథితగరమును వాడుదురు) వెల్తురుచెక్క నెమలిచెక్క ఆరుదొండవేరు ఉలిమిరిచెక్క నేలవేము నల్లబలుసు తక్కెడవేరుపట్ట మష్టుపుచిగుళ్ళు జిల్లేడు చెక్క మునగచెక్క ఆరెపూవు కాకిదొండ గింజలు యిరుగుడుచెక్క గారవేరు ఇల్లింద పచ్చాకు దుందిలపువేరుపట్ట తెల్లబాడిద వేప నేలయుసిరిగ పల్లేరు పెదముత్తనపులగం చిన్నముత్తవపులగం నాగముత్తవపులగం పిల్లిపీచర నేలతాడి సుగంధిపాల నల్లకలువ తామరపూవు గూడపాల ములక వాకుడు పెన్నేరు నేలగుమ్ముడు బ్రహ్మదండి పెగ్గుమ్ముడు యీతగుంజ ముస్తలు వావిలి తెల్లదింటెన గుంటగలగర నేలతంగేడు తెల్లతెగడ రేగు వరగోగు మొరళి అడవికంద కోలపాల దిరిశెన నూనెముంత కామంచి పొన్నగంటి తంగేడు రేల అడ్డసరము తులసి కూతురుబుడమ లొద్దుగు మర్రి చింత సంబరేణు చీకువెలగ నల్లేరు అరటిగడ్డ బోడతరం ములుగోరింట మేడి జున్న వెంపలి నేరేడు పెద్దమాను వెలగ గలిజేరు చేమపొట్ల రేగడిదూలగోవిల ఉత్తరేణు మా[illegible]ముగ చిత్ర సహదేవి పూవాకేడు పులిచింత



బక్రింక మద్ది యిప్ప తగశిర దేవదారు తుమ్మకొండచెండ నూరేడు కమ్మరేగు విష్ణుక్రాంత పాచితీగ చాతరాశి చక్రవర్తికూర వాయింట పర్పాటకము దంతి సోమెంత జమ్మి చిరుబొద్ది తుమ్మి దానిమ్మ యీచెట్లవేరు పట్టలు ప్రత్యేకము రెండు తులములు చొ॥ ను, త్రిఫలములు త్రికటుకములు వాయువిడంగాలు లవంగాలు దాల్చినచెక్క నాగకేసరాలు తాలీశపత్రి యాలకులు జాజికాయ జాపత్రి ఆకుపత్రి వాము కురాసానివాము జీలకర్ర నల్లజీలకర్ర కచోరాలు కర్కాటకశృంగి విషకట్రకాలు సేవ్యా గంటుభారంగి పిప్పలికట్టె గొబ్బివిత్తులు మంచిగంధము బూరుగుజిగురు ధనియాలు యష్టిమధుకము వట్టివేరు తిప్పసత్తు పసుపు మానుపసుపు మరాటీమొగ్గలు ప్రత్తివిత్తులు గొంతెమగోరు జటామాంసి చెంగల్వకోష్టు తవక్షీరి కుంకుమపూవు తక్కోలాలు రేణుకలు వరిపేలాలు కలింగరాస్నం కటుకరోహిణి ఇవి ప్రత్యేకం తులము చొ॥ ను, అన్నిటికిసమం ఫిరంగిచెక్కయున్న, ద్రాక్ష ఖర్జూరము కన్యకోమలి యివి ప్రత్యేకము 3 తు॥ యీపై ప్రకారం అన్నివస్తువులను దంచి వస్త్రగాలితముచేసి యీచూర్ణమును పైపాకమునవేసి కలియగలిపి లేహ్యపాకమున దింపి చల్లారినతరువాత 2 ప్ర॥ తేనె కలిపి కుండలోనుంచి ఒక

రాసము ధాన్యరాశి యందు నిల్వయుంచి పూట ౹౹ అరతులం చొ౹౹ సేవించిన వాతపిత్త కఫరోగము లన్నియు నశించును. సవామేహాములవలన క్షీణించిన జవసత్త్వములను శుక్రమును కాంతిని మరల కలుగ జేయును. సకల యోనిదోషములను లింగదోషము లను నివారించును. బహుమూత్రమును పోగొట్టును. సుఖరోగములు జీర్ణించిన వారికి లేహ్యము అమృత సమానమై మంచి ఆరోగ్యసంపత్తు నిచ్చుననుటకు సంశయము లేదు.

—♦ భగందరములకు మలామా. ♦—

పాచిచీగనుకాల్చి మసిచేసి 1 తులం మసియందు పావుతులం మృద్దారుశృంగి పావుతులం రసకర్పూరం కలిపి తెల్లజిల్లేడుపూవుల రసముతోనూరి ఆముదము కలిపి భగందరమునకు పట్టివేసిన రంధ్రములు పూడి కురుపు మానును.

—♦ మరియొకపట్టి. ♦—

బొంతజెముడుపాలు జిల్లేడుపాలు అను వానితో మానుపసుపును అరుగదీసి గుడ్డకు పట్టించి పట్టివేసిన ను భగందరము మానును.

—♦ గంధకభస్మము. ♦—

జెముడుకాడలను నలియగొట్టి యెండించి కాల్చి మసిచేసి యామసియందు అష్టశుద్ధులు గావింపబడిన



గంధకపు ముక్కనుబెట్టి రెండుగంటలసేపు సాధారణ మైన అగ్నిచే వండవలెను. అప్పుడా గంధకము క ట్టును. అట్లు బద్ధమైన గంధకమును కోడిగ్రుడ్డులోని తెల్లసొనతో నూరి యెండించి మూర్ఖండాకు పస రుతో నూరి బిళ్ళచేసి శరావసంపుటమందుంచి లఘు పుటము వేసిన తెల్లని భస్మమగును. దీనిని పూటకు అడ్డిగెత్తు చొ౹౹ సుగంధి బావంచాలు కషాయముతో ఉదయమునను, ఫిరంగిచెక్క ఉలిమిడిచెక్క కషాయ ముతో నాయంత్రమునను వెన్నలోపొదిగి సేవించ వలెను. సకలసవాయిలు మచ్చలు పొడలు దద్దుర్లు శమించును. రక్తముశుద్ధమగును. శరీరకాంతినిచ్చును.

—♦ సవీరసిందూరము. ♦—

సవీరము 4 తు౹౹ రసకర్పూరం 3 తు౹౹ రసము 4 తు౹౹ గంధకం 8 తు౹౹ వీనిని 4 తు౹౹ వేపచెక్క గంధ ములో నూరి చిన్నమాత్రలుచేసి నీడనుఆరనిచ్చి వా లుకాయంత్రమున 2 దినములు వండి సిందూరమును గ్రహించి చూర్ణించి తాటిబెల్లములో పొదిగి గుం జెత్తు చొ౹౹ సేవించిన సవాయిలు మానును. యు క్తానుపానములతో క్షుద్రవ్యాధులందు వాడనగును.

—♦ ఖదిరారిష్టము. ♦—

చంద్రచేవ 200 తు౹౹ దేవదారుచేవ 200 తు౹౹ వస 80 తు౹౹ పసుపు 100 తు౹౹ బావంచాలు 48 తు౹౹

వీనిని నలియగొట్టి 8 ద్రోణముల నీటితో వేసి 1 ద్రోణముగ కాచి వడియగట్టి ఆకషాయమునందు ఆరెపూవు 32 తు॥ తేనె 800 తు॥ పంచదార 400 తు॥ పోకపండ్లు లవంగాలు ఏలకులు జాజికాయ లవంగపట్ట నాగకేసరములు మిర్యాలు ఆకుపత్రి ప్రత్యేకము 4 తు॥ మిర్యాలు 16 తు॥ చూర్ణించి చేర్చి సంధిబంధము గావించి ఒకమాసము భూమిలో పాతిపెట్టితీసి వడియగట్టి భద్రపరచునది. మోతాదు—ఒక తులము. గుణము:—ప్రమేహము జీర్ణించి క్రమముగ రక్తక్షీణమై అపరిశుభ్రమై శరీరము నందు తేమ దద్దులు చర్మము పగిలి నీరుగారుట మున్నగు కుష్ఠరోగ వికారములు నశించుటయే గాక పాండువు కాస గ్రంథులు అర్బుదము ఉదరము మొదలగు రోగములనుగూడ ఖండించును.

—♦ శారిబాద్యాసవము. ♦—

సుగంధిపాల తుంగముస్తలు లొద్దుగుచెక్క మర్రిపట్ట రావిపట్ట కచూరము నల్లసుగంధి పద్మకము కురువేరు అగరు శొంఠి తిప్పతీగ వట్టివేరు రక్తచందనము తెల్లచందనము వాము కటుకరోహిణి ఆకుపత్రి పెద్దయేలకులు చిన్నయేలకులు చంగల్వకోష్టు సునాముఖి కరక్కాయ ప్రత్యేకము 4 తు॥ చూర్ణముగ చేసి 512 తు॥ నీళ్ళలో వేసి అందు 300 తు॥ బెల్లము 10 తు॥



ఆరెపూవు 60 తు॥ ద్రాక్షపండు చేర్చి సంధిబంధము గావించి నెల దినములుంచి వడియగట్టి 1 మొదలు 2 తు॥ వరకు సేవించుచుండిన మేహరోగములు మేహపిటకలు ప్రమేహములు దానివలన బుట్టిన వాతరక్తము మొదలగు చర్మరోగములు భగందరము నశించును. మేహరోగమందపథ్యములు:—సారాయి సుస్విన్నము తీక్ష్ణ పదార్థములు మలమూత్రాది నిరోధము విషమస్త్రీ సేవ అతి వ్యాయామము రాత్రి జాగరణము చేయుట వెల్లుల్లి యెండతిరుగుట సుఖరోగులకు అహితములు.

మేహరోగ ప్రకరణము.

—♦ వసంతకుసుమాకరము. ♦—

సువర్ణభస్మము 2 తు॥ రజతభస్మము 2 తు॥ వంగభస్మము 3 తు॥ సీసభస్మము 3 తు॥ లోహభస్మము 3 తు॥ కాంతభస్మము 3 తు॥ రససింధూరము 4 తు॥ అభ్రకభస్మము 4 తు॥ పగడభస్మము 4 తు॥ ముత్తియపుభస్మము 4 తు॥ వీనిని ఆవుపాలు చెఱకు అడ్డసరము చందనము వట్టివేరు కురువేరు పసుపు అనుపాని కషాయములతోను అరటిగడ్డ తామరపూవు జాజిమొగ్గలు వీని స్వరసములతోను వేర్వేరుగా ఏడేసిమార్లు భావనచేసి పిదప కస్తూరితో

భావనచేసిన వసంత కుసుమాకరమను పేరంబరం గు. అందు 2 గుంజలయెత్తు ఔషధమును శర్కర నెయ్యి తేనె అనుపాని యనుపానముతోడ సేవించిన మధుమేహము క్షయము కాసము దప్పి ఉన్మాదము శ్వాసము రక్త విష దోషములు పాండువులు శూలలు మూత్రఘాతము అశ్మరి మధుమేహము అను రోగంబుల హరింపజేయుటయేగాక కామసుఖము పుష్టి వీర్యవృద్ధి ఆయుర్వృద్ధి ప్రజోత్పత్తి కాంతి బలము గలుగజేయును.

—♦ జాత్యాదివటి. ♦—

జాజికాయ జాపత్రి ములకవేరు నల్లమందు యివి ప్రత్యేకమొక భా॥ కురాసానివాము 2 భా॥ గంజాయి 4 భా॥ వీనిని కొబ్బరినీళ్ళతో నొకజాము మర్దించి శనగలవలె మాత్రలుచేసి పాత్రస్నాయంత్రములం దొక్కొక్క మాత్ర సేవించునెడల అనేకసార్లు మూత్రమగుట కొద్దిసార్లు అయినను అధిక ప్రమాణముగ మూత్రమగుట నీరసము కాళ్లులాగుట మితిమీరిన ఆకలి దప్పికలు ఒకటి రెండు రోజులలోనే తగ్గును. జాత్యాదివటి ½ తు॥ వసంతకుసుమాకరం ½ తు॥ కలిపి 40 మాత్రలుచేసి యుపయోగించిన శీఘ్రఫలప్రదమై స్థిరమగు ఆరోగ్యమిచ్చును.



—♦ వంగావలేహము. ♦—

వంగము సీసము ఇర్రికొమ్ము గంధకము ప్రత్తి పప్పు తంగేడువిత్తులు సమముగ నూరి బర్రిమజ్జిగలో గలిపి త్రాగిన మేహరోగము హరించును.

—♦ చంద్రోదయరసము. ♦—

అభ్రకభస్మము గంధకము రసము వంగభస్మము ఏలకులు కర్పూరశిలాజిత్తు వీనిని సమభాగములుగ అరటిగడ్డ రసముతో మర్దించి మాత్రలుజేసి సేవింపుచుండిన 20 మేహములు హరించును.

—♦ చందనాసవము. ♦—

హరిచందనము కురువేరు ముస్తలు పెగ్గుమ్మను నల్లకలువ పేరింఖణము పద్మకము లొద్దుగు మంజిష్ఠ రక్తచందనము చిరుబొద్ది నేలవేము మర్రిపట్ట రావిపట్ట కచూరము పర్పాటకము యష్టిమధుకము రాస్న చేమపొట్ల దేవకాంచనపుపట్ట మామిడిపట్ట బూరుగుబంక యివి ప్రత్యేకము 1 పలము ఆరెపూవు 16 ప॥ ద్రాక్షపండు 20 ప॥ నలియగొట్టి 2 ద్రోణముల నీటిలోవేసి అందు 100 ప॥ పంచదార 50 ప॥ బెల్లము చేర్చి కుండలోబోసి చీరజేసి మాసమునకు నిలవయుంచి వడియగట్టుకొని భద్రపరచవలె. మో॥ 1 మొదలు 4 తు॥ వరకు. శుక్రమేహమును హరించును. బలము పుష్టి అగ్నిదీప్తి కలిగించును.

## కూష్మాండావలేహము.

బూడిదగుమ్మడి కాయలోని గింజలను పైపెచ్చును బుఱుగును తీసివేసి తక్కినభాగమును సన్నని ముక్కలుగ తరిగి 100 తు॥ ముక్కలను 200 తు॥ నీటిలోవైచి సగము ఇంకువరకు ఉడికించి చల్లార్చి వడియగట్టి రసమును భద్రపరచుకొని ముక్కలను కొద్దిగా ఎండించి మట్టిపాత్రలోవేసి 25 తు॥ నేతితోవేయించి ఉంచుకొనేది. వడియగట్టిన రసములో 50 తు॥ పంచదారజేర్చి పాకముబట్టి వేయించిన ముక్కలువేసి సంధుచు పిప్పళ్ళు శొంఠి జీలకర్ర నల్లజీలకర్ర ప్రత్యేకము 8 తు॥ ధనియాలు జాపత్రి ఏలకులు మిరియాలు దాల్చినచెక్క ప్రత్యేకము 2 తు॥ చూర్ణించిచేర్చి పాకమైనతరువాత చల్లార్చి 25 తు॥ తేనె, 12 తు॥ పటికెబెల్లము, 12 తు॥ దాక్షపండ్లు, 3 తు॥ లవంగములు 1 తు॥ పచ్చకర్పూరము చేర్చి దించి భద్రపరచేది దీనిని 1 తు॥ మొదలు 2 తు॥ సేవించిన మేహములు అజీర్ణములు పైత్యములు వాంతులు నిక్కాక మేహము హరించి వీర్యవృద్ధి బలము కలిగించును.

## బృహత్సోమనాథరసం.

హింగుళోత్థరసము గంధకము ఒక్కొక తులము ఖల్వమునందుంచి చేతరాసిత్రకు రసము ఎలుకచెవియాకు రసములతో రెండుదినములు మర్దించి లోహభస్మము 4 తు॥ లుచేర్చి కలబందతో ఒకదినము నూరి అభ్రకము రజతము వంగము వీనిభస్మములు శుద్ధకఫరి హేమమాక్షిక భస్మము వీనిని ప్రత్యేకము 4 తు॥ స్వర్ణభస్మము అరతులముచేర్చి కలబంద సరస్వతియాకు రసములతో ఒకవారము మర్దించవలెను. మోతాదు:—రెండు గుంజలయెత్తు. గుణము:—సోమరోగము ప్రమేహము మూత్రాతిసారము మూత్రకృఛ్రి మధుమేహము మొదలగు మేహములందు వసంతకుసుమాకరమువలె పనిచేయును.



## సారస్వతఘృతము.

మాండూక బ్రహ్మిని సమూలముగ దెచ్చి కడిగి తొక్కి తీసినరసము 4 ప్రస్థములు. ఘృతము 1 ప్ర॥ జాజిపూలు చెంగల్వకోష్టు తెల్లతెగడ కరక్కాయ ప్రత్యేకము 1 ప॥ పిప్పళ్ళు వాయువిడంగాలు సైంధవలవణము శర్కర వస ప్రత్యేకము 1 కర్షము వీని కల్కముజేర్చి మందాగ్నిచే పాకముచేసి 7 దినములు సేవించిన కిన్నరస్వరము గలుగును. 15 దినములకు శరీరసౌందర్యము కలుగును. 1 మాసము సేవించిన విన్నమాత్రమున జ్ఞప్తికలుగును. అష్టాదశకుష్ఠువులు అర్శస్సు పంచగుల్మములు ప్రమేహము శ్వాస కాస వంధ్యాదోషము నివర్తించును. బలము వర్ణము జఠరదీప్తి కలుగును.

—♦ అతిమూత్రమునకు. ♦—

తంగేడుగింజల చూర్ణమును తేనెతో సేవించిన అతిమూత్రము హరించును.

ఆరెదొండ యిగురు 2 తు॥ వెల్లుల్లి 1 తు॥ మిర్యాలు 1 తు॥ వేసిని మెత్తగనూరి కుంకుడుగింజలంతమాత్రలుచేసి దినమునకు రెండుచొ॥ 9 దినములు సేవించిన అతిమూత్రము నివర్తించును.

—♦ పరమహంసక్రియ. ♦—

1 తులము ఉత్తరేణిబీజము కొద్దిగా నువ్వులనూనెతో ఉడికించి మూడు ఉదయపు పూటలు సేవించినయెడల అతిమూత్రము అమితమైన అకలితగ్గును. 4 వ దినమునుండి కృష్ణాభ్రకసింధూరమును వాడేది.

—♦ మరియొకయోగము. ♦—

ఖర్జూరపుకాయలలోని గింజలను తీసివేసి అందు గవ్వపలుకు సాంబ్రాణి చూర్ణమును కూరి దారముతో బిగించి ఆవుపాలలో ఉడికించి యెండించి తేనెలోఊరబెట్టి పూటకు ఒకకాయ నో॥ సేవించుచుండిన అతిమూత్రము నివర్తించును.

—♦ అశ్మరికి వచాదివటకములు. ♦—

అతివస కొండపిండివేళ్లు యవక్షారము సైంధవలవణము సమముగ గోమూత్రముతో నూరి మాత్రలుజేసి బియ్యపు కడుగుతో నూరిన కరక్కాయతో



సేవించిన అశ్మరి మూత్రఘాతము హరించును.

—♦ మూత్రాఘాతమునకు. ♦—

1 సన్నపల్లేరుకాయలు ఆముదపువేళ్ళు ఓల్లిపిచర సమముగదంచి కషాయముగాచి త్రాగిన మూత్రఘాతము మూత్రకృఛ్రము హరించును.

2 తెల్లజొన్నల గడుగు 1 తు॥ ఉత్తరేణాకురసం అరితులం సురాకారం పటికి జీలకర్ర పంచదార యివి ప్రత్యేకము 2 చిన్నములు కలిపి త్రాగిన తక్షణం మూత్రము ధారాళముగ వెడలును.

—♦ మేహములకు పథ్యములు. ♦—

వ్రాతబియ్యము గోధుమలు జాంగలమాంసము మజ్జిగ తెలకపిండి వెన్న బచ్చలికూర పొన్నగంటికూర తేనె మేడికాయ లేతఅరటికాయ వెలగపండు సంచారము అభ్యంజనము ఇవి పథ్యములు.

—♦ అపథ్యములు. ♦—

చెఱుకు కల్లు బెల్లము నెయ్యి పాలు పులుసు ఇరిగువ ఉప్పు వెల్లుల్లి పగటినిద్ర స్త్రీసంగమము మత్స్యములు నువ్వులు అవాలు శొంఠి టెంకాయనీరు పిండివంటలు పనసపండు కందగడ్డ ఇవి అపథ్యములు.

శిరోరోగచికిత్సా ప్రకరణము.

—♦ మహాభృంగామలకతైలము. ♦—

నూనె 4 శేర్లు, నేయి 4 శేర్లు, ఆముదము 2

శేర్లు, గుంటగలగరరసము 5 శేర్లు, ఉశిరిగరసం 2 శేర్లు, కూతురుబుడమ రసం, చేమబీరరసం, మొగలిచండ్లరసం, నీలియాకురసం, ఆవుపాలు, కొబ్బరినీరు తెప్పతీగెరసం, పిల్లిపీచరరసం, కలుబందరసం, వావిలియాకుకషాయం, పొన్నగంటిరసం ఇవి ప్రత్యేకము 2 శే॥ వట్టివేరు, ముస్తలు, రక్తచందనము, కచోరాలు, నల్లజీడిగింజలు, కురువేరు, చెంగల్వకోష్టు, కృష్ణాగురు ప్రత్యేకము 2 తు॥ చొ॥ కల్కముచేసి చేర్చి కాచి వడియగట్టి శిరస్సునకు మర్దనచేసిన మాడుపోటు, చెవిహోరు, కంఠమంట, పేనుకొరుకుట గాలిపోవుట, అకాలమున నెరయుట, చెవుడు శమించును.

—♦ భృంగరాజతైలము. ♦—

నూనె 64 తు॥ గుంటగలగరరసము 64 తు॥ నీలివేళ్ళకషాయము 64 తు॥ చంద్రపొత్తులు, నీలివేళ్ళు, నల్లతుమికిచెక్క, యష్టిమధుకము వీనికల్కము ప్రత్యేక మొకతులము వేసి కాచి వడియగట్టి శిరస్సునకురాచిన పేనుకొరుకుట నెరయుట నశించి కన్నులకును మెదడునకును ప్రసాదము కలుగును.

—♦ తలనొప్పికి కృష్ణాదిలేపము. ♦—

పిప్పళ్ళు వట్టివేరు శొంఠి అతిమధురము పిల్లిపీచర నల్లకలువ ఖురువేరు వీని నుదకముతో నూరి శిరస్సునకు లేపముచేసిన శిరశ్శూలల నివర్తించును.



—♦ శిగ్రుపత్రాదిలేపము. ♦—

మునగాకురసముతో మిరియములను నూరి శిరసునకు లేపము చేసినచో వాతమువలన గలుగు తలనొప్పి నివారణమగును.

—♦ పిప్పల్యాదినస్యము. ♦—

పిప్పళ్ళు సైంధవలవణము చూర్ణించి నేతిలో వేసి కాచి నస్యముచేసిన శిరశ్శూల నివర్తించును.

—♦ భృంగాదినస్యము. ♦—

గుంటగలగరరసము మేకపాలుకలిపి సూర్యపుటము బెట్టి నస్యముచేసిన ఒంటితలనొప్పి తగ్గును.

—♦ శుంఠ్యాదినస్యము. ♦—

శుంఠిని మేకపాలతో అరగదీసి నస్యముచేసిన శీఘ్రముగ తలనొప్పి శమించును.

—♦ శశాదియోగము. ♦—

బాలింతపోలు బోడతరపు రసము మిరియాలు వీనిని నూరి భోజనాత్పూర్వము త్రాగుచున్నయెడల 7 దినములకు పార్శ్వపునొప్పి సన్నిపాత సూర్యావర్తము మొదలగు దారుణ శిరోరోగములు కుదురును.

—♦ నీలోత్పలాదితైలము. ♦—

నల్లకలువ పిప్పలి అతిమధురము చందనము తెల్లతామరపూవు ప్రత్యేకము 4 నిష్కములు కల్కము చేసి 16 ప॥ నూనె, 64 ప॥ ఉశిరిక రసముతో చేర్చి

కాచి వడియగట్టి నస్యము అభ్యంజనముచేసిన సకల శిరశ్శూలలు నివర్తించును.

—♦ చందనాదితైలము. ♦—

మంచిగంధము కచ్చూరము కలబందగుజ్జు కలువపూవులు ప్రత్యేకము 16 తు॥ నలియగొట్టి 4 సేర్ల నీళ్లలోవేసి 4 వంతుగ గాచి వడియబోసిన కషాయము 1 భా॥ కొబ్బరినీరు 1 భా॥ నిమ్మపండ్లరసము 1 భా॥ ఆవుపాలు 1 భా॥ కొబ్బరినూనె ½ భా॥ ఆవునెయ్యి ¼ భా॥ నువ్వులనూనె 1 భా॥ భాండమునందుంచి. సుగంధిపేరు రాచఉసిరిగవేరు గచ్చవేరు చల్వమిర్యాలు మంచిగంధము లోహకిట్టము ప్రత్యేకము 1 తు॥ నీళ్లతోనూరి ముద్దజేసి చేర్చి కాచి వడియగట్టి శిరస్సునకు రాచుకొనుచుండిన తలత్రిప్పు మతిచాంచల్యము తలదిమ్ము చెవిలోహోరు తలనొప్పి కండ్లమంట మసక నశించును. మెదడునకు కండ్లకు చలువచేయును. ఉత్తమయోగము.

—♦ పార్శ్వపునొప్పికి చికిత్సలు. ♦—

1 కాచిన ఆవుపాలలో రాత్రిపూట వేడియన్నమునువేసి తోడుపెట్టి అందు కొంచెము శొంఠిచూర్ణమునుచల్లి మూతపెట్టి పరుండుమంచముక్రింద నుంచుకొని తెల్లవారుజామున 4 గడియల పొద్దుండగా లేచి కన్నులు తెరవకుండ మూత్రవిసర్జనము చేసికొన



కపూర్వమే ఆయన్నమును మూడు లేక అయిదు కబలములు తినవలెను. ఇట్లు తినుటలో తనచేతులతో కలుపుకొనకుండ మరియొకరు కలిపి చిన్న ఆకుముక్కలోనుంచినచో తనచేతికంటకుండ తిని మ్రింగవలెను. లేదా యితరులు నోటిలో పెట్టవచ్చును. గాని రోగి తన కాలు చేతులు తడిచేసుకొనరాదు. యిట్లు మూడు లేక అయిదుదినములుచేసినచో పార్శ్వపునొప్పి తప్పకనివర్తించును. వృద్ధోపదేశము.

2 రాత్రిపూట స్వచ్ఛమగు రాగిచెంబులో నిల్వయుంచబడిన మంచినీళ్ళు తెల్లవారుజామున 4 గడియలపొద్దుండగా లేచి మూత్రవిసర్జనము చేయకపూర్వమే వెండిపాత్రలో ఆనీరుపోసుకొని మూడు తులములు చీనాపంచదార కలిపి వడియబోసి 8 గ్రుక్కలనీళ్లుత్రాగవలెను. ఇట్లు 9 లేక 11 దినములు పుచ్చుకొనిన ఒంటితలనొప్పినయమగును నిశ్చయము

3 వస శొంఠి యీరెండును సమముగ చూర్ణించి నస్యముచేసిన ఒంటితలనొప్పి నెమ్మదించును.

—♦ శిరోరోగములందు పథ్యములు. ♦—

లంఘనము శిరోవస్తి రక్తస్రావము [illegible] ప్రాతనేయి 60 దినములకుపండు ధాన్యము యవధాన్యము పాలు అడవిమృగముల మాంసము పొట్లకాయ మునగకాయ ద్రాక్షపండు కాకరకాయ ఉసిరిగకా

య మాదీఫలము మజ్జిగ కలి బెంకాయ కరక్కాయ.

—♦ అపథ్యము. ♦—

తుమ్ములు ఆవలింతలు మలమూత్రములు నిద్ర వీని నడ్డగించుట పాలు విరుద్ధాహారము పగటినిద్ర,

దంతరోగచికిత్సా ప్రకరణము.

—♦ జీరకాదిచూర్ణము. ♦—

జీలకర్ర ఉప్పు కరక్కాయ బూరుగుముళ్ళు వీనిని చూర్ణించి ప్రతిదినము దంతములు తోమిన చిగురుబ్బుట రక్తముస్రవించుట మానును.

—♦ క్రిమిదంతమునకు లాంగల్యాదియోగము. ♦—

చన్నచర్లగడ్డను నీళ్ళతో నూరి క్రిమిదంతమునకు రాచిన పోటుతగ్గి క్రిములు ఊడిపడును.

—♦ క్రిములుపడిపోవుటకు. ♦—

1 వాకుడుగింజలను మంచినూనెతో తడిపి బొగ్గు నిప్పులపై వేసి ఆపొగను నోటితో పట్టి కొంతసేపుంచి ఒకపళ్ళెములో నీళ్ళుపోసి అందు ఉమియవలెను. దంతములనుండి వచ్చిన పురుగులు ఆనీళ్ళలో కనబడును. ఇట్లు రెండు మూడుసారులుచేసి పురుగులన్నియు పడపోవుట తెలిసికొనవలెను.

2 క్రిమిదంతమునందు సీతాఫలపు పుల్లను పెట్టి త్రిప్పిన మొదల పురుగులు బైటకువచ్చును.



3 గాటుగలయింగువనుగాని హారతికర్పూరమును గాని క్రిమిదంతమున బెట్టినచో తాత్కాలికముగ బాధతగ్గును

—♦ జాతీపత్రాదిచూర్ణము. ♦—

జాపత్రి గలిజేరు గజపిప్పలి ములుగోరింట చంగల్వకోష్టు వస చవ్యము శొంఠి కరక్కాయలు వీనిని సమభాగములుగ చూర్ణించి దంతములకు రాచిన దంతవాతము క్రిములు దంతశూల చీము రక్తముకారుట దుర్గంధము మొదలగుబాధలు నివర్తించును.

—♦ వరాటాదిచూర్ణము. ♦—

తేనెగవ్వలు అరవీసెడు, నల్లజీడిగింజలు వీసెడు, వీనిని ఇనుపమూకుడులో పోసి మాడ్చి చూర్ణించి అందు 10 తు॥ సీమసున్నము, 5 తు॥ కాచు 1 తు॥ పొంగించినపటిక, 1 తు॥ హారతికర్పూరము, పుదీనా పువ్వు చిన్నముచేర్చి కలిపి దంతధావనము జేయునెడల దంతములు కదులుట తీపు రక్తము చీముస్రవించుట మొదలగు సమస్తదంత బాధలు నివర్తించును.

నేత్రరోగ ప్రకరణము.

—♦ కతకాద్యంజనము. ♦—

చిల్లగింజలు శంఖము సైంధవలవణము త్రికటుకములు చక్కెర సముద్రపునురుగు రసాంజనము తేనె వాయువిడంగములు మణిశిల కోడిగ్రుడ్డు పెంకులు వీ

నిని సమములుగ చనుబాలతో మర్దించి కణికలుచేసి నిమ్మపండ్ల రసముతో చాది కన్నులలో బెట్టిన వర్త్మ రోగము దృష్టిఘాతము తిమిరపటలకాచ అర్మములు పువ్వులు దురద నీరుకారుట నేత్రార్బుదము పుసి యివి హరించును.

—♦ తామ్రాద్యంజనము. ♦—

తామ్రభస్మము ధాన్యాభ్రకము మైలతుత్థము శుద్ధిజేసిన కఫర వీనిని ప్రత్యేకము 10 నిష్కములు చూర్ణించి మూకుడులోపోసివేయించుచు 30 నిష్కముల శుద్ధగంధక చూర్ణము కొంచెముకొంచెముగ వేయుచు పొగ పైకిపోకుండ మూకుడుమూసి గంధకమంతయు జీర్ణమగువరకు మాడ్చి దానిని 64 తు॥ ల నీళ్ళలోకలిపి పిసికి అడుగునకు తేరిన మడ్డిని పారవేసి నీళ్ళను ఎండలో బెట్టి యిగిరిపోయిన తరువాత క్రిందనుండు చూర్ణమును గ్రహించి అందు 1 తులము మైలతుత్థమును మణిశిలచూర్ణమును కలిపినూరి వస్త్రగాలితముచేసి తేనె తేక నేయి చనుబాలతో కలిపిఅంజనముచేసిన నేత్రరోగములన్నియుకుదురును.

—♦ తిలపుష్పాంజనము. ♦—

మిరియాలు 1 తు॥ శుద్ధకఫర 2 తు॥ నువ్వుపువ్వులు 4 తు॥ వీనిని నిమ్మపండ్లరసముతో నూరి కణికలుచేసి చనుబాలతో చాది అంజనము చేసిన తిమిర



ము దురద పొర అర్బుదము ఎరుపు దుర్మాంసము వీనిని 1 దినములో నశింపజేయును.

—♦ మరిచాంజనము. ♦—

మిరియాలు 1 తు॥ ఉసిరికపలుపు 2తు॥ క్రొన్నగవిత్తులు 3 తు॥ వీటిని గుంటగలగరాకు రసముతో నూరి కణికలుచేసి నేత్రములయం దంజనము వేసిన పొరలు కాచను ఇవి హరించును.

—♦ మహానారికేళాంజనము. ♦—

అతిమధురము కరక తాడి ఉసిరికలు మానిపసుపు ప్రత్యేకముగ 1 ప॥ చొ॥ జేర్చి నల్లియగొట్టి 64 తు॥ ల కొబ్బరినీళ్ళలో వైచి 8 వ వంతుగ కాచి మరియొకకుండయందుపోసి సన్నపుసెగను 5 ప॥గ కాచి చల్లార్చి అందు మైలతుత్థము పచ్చకర్పూరము సముద్రపు నురుగు కావిరాయి సైంధవలవణము రసాంజనము మిరియాలు వీటిచూర్ణము దినుసుకు నిష్కము చొ॥ కలిపి తేనె 1½ తు॥ కలిపి అంజనముచేసిన నేత్రరోగములన్నియు కుదురును.

—♦ అర్ధచంద్రోదయము. ♦—

పచ్చకర్పూరము పటిక శంఖము చందనము అతిమధురము గూడపాలవేరు మంజిష్ఠ పసుపు మానుపసుపు భిల్లగింజలు కావిరాయి ఇవి సమభాగములు వీనికన్నిటికి సమము శుద్ధిజేసిన మైలతుత్థము వీటిని

నిమ్మపండ్లరసముచే మర్దించి అంజనంబిడిన రేచీకటి తిమిరము దురద పొరలు కాచము కంటికొనయందు జనించురోగములు పుష్పములు మొదలగు సర్వరోగములు నొకమాసములో హరించును.

—♦ చంద్రోదయవర్తి. ♦—

పసుపు వేపచిగురు పిప్పళ్లు మిరియాలు తాండ్రి కాయలలోనిపప్పు క్రానుగవిత్తులు శంఖము శుద్ధనాభి శుద్ధ మణిశిల సమములుగ మేకపంచితముతో నూరి కణికలుజేసి నీళ్ళతో చాది కన్నులలో వైచిన దురద పొరలు అర్బుదము మూడువత్సరములుగ నుండు కంటిపువ్వులు దుర్మాంసము రేచీకటి వీనినొకమాసములో నివర్తింపజేయును.

—♦ కంటిపువ్వులకు లేఖనవర్తి. ♦—

క్రానుగవిత్తులచూర్ణమును మోదుగుపువ్వులరసముతో భావనచేసి మెత్తగనూరి వర్తిచేసి నీళ్ళతో చాదిఅంజనముచేసినపూలు మాంసవృద్ధినివర్తించును

—♦ శంఖాదివర్తి ♦—

శంఖభస్మము 8 తు॥ రక్తమణిశిల 4 తు॥ మిరియాలు 2 తు॥ సైంధవలవణము 1 తు॥ వీనిని మేకపాలతో మర్దించికణికెలుజేసి నేత్రములయందు వైచిన రేచీకటికాచము, పువ్వులు, పొరలు, దుర్మాంసము, మెరుపు, 7 దినములలో తగ్గును.



—♦ తిమిరాదులకు రోపణరసక్రియ. ♦—

1 కర్షము తిప్పతీగెరసమునందు 1 క॥ తేనె 1 క॥ సైంధవలవణము వైచి మర్దించి అంజనము చేసిన పిల్లము అర్మము తిమిరము కాచబిందువు దురద లింగనాశము తెల్లగుడ్డునందలి రోగములు నివర్తించును.

—♦ స్రావములకు రోపణీరసక్రియ. ♦—

నల్లతుమ్మఆకు కషాయమున తేనెచేర్చి మర్దించి కన్నులకంజనంబిడిన నిస్సంశయముగ నేత్రస్రావము హరించును.

—♦ లేపనము. ♦—

1 అతిమధురము కావిరాయి సైంధవ లవణం మాసిపసుపు రసాంజనం సమములుగ నీళ్ళతోనూరి కంటిచుట్టు రాచిన నేత్రరోగములు హరించును.

2 రసాంజనము ఉదకముతో నూరి గాని కలుబంద చిత్రమూలపు ఆకులు నూరి గాని దానిమ్మ ఒగుళ్ళను నూరిగాని వస పసుపు శొంఠి కావిరాయి వీటిని ఉదకముతో నూరిగాని నేత్రములచుట్టు లేపనముజేసిన నేత్రరోగములు హరించును.

—♦ జంబీరాద్యంజనము. ♦—

నిమ్మపండును అంతట రాగిముల్లుతో పొడిచి ఆ పొడిచినచోట ఒక్కొక్క లవంగమును గ్రుచ్చవలెను. ఇట్లు పండుయొక్క అన్నిభాగములయందు ల

వంగములను గ్రుచ్చి అరచేతి మందముగ ఆవు వెన్నను పండునకుపొదిగి ఒకకుండలోపెట్టి కాయమునుగునట్లు నీళ్ళుపోయవలెను. ప్రతిదినము పాతనీరు పారబోసి క్రొత్తనీరు పోయుచుండవలెను. ఇటుల 40 దినములు నానబెట్టి తీసి నిమ్మపండును వెన్నసహా యీవత్తు మెత్తగా కల్వములో ముందు నూరుకొని పిదప కంచుకంచములో వేసి రాగిపాత్రతో మర్దన చేయవలెను. కండ్లలో పెట్టుటకు తగినంత మృదుత్వముకలుగువరకు నూరి రాగిభరిణెలోనుంచి అంజనముచేసిన పూవులుమానును.

N. B. పైవిధముగ 40 దినములు భావన చేయబడిన నిమ్మకాయలో గ్రుచ్చబడిన లవంగములను ప్రత్యేకముగ కొన్ని తీసి యుంచుకొని ఆలవంగమును కాకరాకుపసరుతో అరగదీసి కలికము వేసినయెడల సన్నిపాతమందలి ప్రలాపము తక్షణము తగ్గును.

### —◆ జసదభస్మము. ◆—

నూనె కాంజికము ఉలవకట్టు పులిమజ్జిగ అను వానిలో సత్తునుకరిగించి ఒక్కొక్క ద్రవ్యములో 7 సార్లుచొ॥ వేసి చల్లార్చి ఆసత్తును మరల కరిగించి వేపాకుమీదపోయవలెను. మరల కరిగించి పచ్చతంగేడాకుమీదపోయవలెను. యిట్లు శుద్ధిపరచిన సత్తును యినుపబాణలిలో వేసి కరిగించి తులము సత్తునకు బేడెత్తు నల్లమందువేసి యినుపగరిటెతో బాగుగా మెదపుచు కొలిమిలో నూమనెడల సత్తు స్వచ్ఛమైన భస్మమగును. వస్త్రగాలితముచేసి భద్రపరచి ఉదయములందు గుంజెత్తుచొ॥ కండ్లకువేసిన 3 దినములకు కండ్లమెరుపు, మంట ఎండచూడనీయకుండుటతగ్గును



### —◆ మరికొన్నిచికిత్సలు. ◆—

1 కండ్లమెరుపులకు:—నల్లమందు కుంకుమపూవు వీనిని వేపాకు కామంచిఆకు పసరులతోగాని పన్నీరుతోగాని నూరి కండ్లలోవేసిన మెరుపులుతగ్గును.

2 పువ్వులకు:—చనుబాలలో పంచదారవేసి కరగించి కండ్లలోవేయవలయును.

3 మసకతెరలకు:—పటికని పన్నీరులోకలిపి గాని అరగదీసిగాని వేసిన నయమగును.

4 రెప్పలువాచి కంటిరోమములు ఊడినందుకు:—సీమబాదంకాయపప్పును చనుబాలతో అరగదీసి కన్నులలో నుంచవలెను.

5 రేజీకటికి:—చెవిగోగులిబి $7\frac{1}{2}$ చిన్నములు సురాకారము $2\frac{1}{2}$ చి॥ కరక్కాయ చూర్ణము $7\frac{1}{2}$ చి॥ వీనిని కలిపి నూరి కణికలుచేసి నీళ్ళతోచాది అంజనము చేయవలెను.

### —◆ నేత్రరోగములయందు పథ్యములు. ◆—

వరిబియ్యము గోధుమలు పెసలు సైంధవలవణము ఆవునెయ్యి ఆవుపాలు పంచదార తేనె ఇవినేత్ర

రోగములయందు పథ్యము.

—♦ అపథ్యము. ♦—

మినుబాల చక్రవర్తికూర పొన్నగంటికూర చిర్రికూర గలిజేరు అను నీ 5 తప్ప తక్కిన యాకు కూరరలు కల్లు పెరుగు ఇంగువ ఉప్పు తెలకపిండి స్నానము సంచారము పిండివంటలు తాంబూలము కోపము ఎండ తేజస్సును జూచుట అగ్నిజ్వాల.

—♦ కర్ణరోగమందు-క్షారతైలము. ♦—

లేతముల్లంగిదుంపల క్షారము శొంఠిక్షారము సర్జక్షారము యవక్షారము సైంధవ సౌవర్చ బిడాసముద్రకాచలవణములు ఇంగువ మునగపట్ట శొంఠి దేవదారు వస చంగల్వకోష్టు సదాపరసాంజనము గ్రంథి తగరము తుంగముస్తలు ప్రత్యేకము తులం చొ॥ కల్కముచేసి అందు 64 తు॥ నూనె, నూనెకు 4 రెట్లు అరటిదుంప రసము అంతయే మాదీఫలరసము అంతయే మధుసూక్తముచేర్చి కాచి వడియగట్టి చెవిలోపోసిన చీముకారుట చెవిహోరుపోటు చెవుడు పురుగులు పడుట నశించును. మధుసూక్తము:—నిమ్మపండ్లరసము 64 తు॥ కుండలోబోసి అందు 16 తు॥ తేనె పిప్పలిచూర్ణము 4 తు॥ చేర్చి మూసి చీరజేసి నెలదినముల వరకు ధాన్యరాశియం దుంచిన నది మధుసూక్త మనబడును.



—♦ కర్ణశూలలకు అర్కపత్రరసము. ♦—

జిల్లేడాకులకు నూనె చమిరి నిప్పుపై కాచి రసముతీసి చెవిలోబోసిన చెవిపోటుతగ్గును.

—♦ బిల్వాదతైలము. ♦—

మారేడుపిందెలను గోమూత్రముతో నూరి కల్కముచేసి అందు 4 రెట్లు నూనె నూనెకు 4 రెట్లు మేకపాలు పాలకుసమం ఉదకముచేర్చి తైలపక్వముగకాచి చెవిలోబోసిన చెవుడునశించును.

—♦ చెవిలోనికురుపులకు తాంబూలరసము. ♦—

తమలపాకులు సున్నము పోక నోటితో నమిలి యాతమ్మును గుడ్డలోనుంచి రసమును చెవిలో 3 ఉదయములందు పిండవలెను. కురుపుచిదుకిమానును.

వాజీకరణప్రకరణము.

1 నేతిలో వేయించిన మినపపప్పును ఆవుపాలలో వైచి శర్కరకలిపి పాయసముచేసి పుచ్చుకొనిన యెడల వీర్యవృద్ధి కలిగించును.

2 తెల్లగురివింద గింజలను ఆవుపాలలోవుడకబెట్టి పైపొట్టువలిచి ఆరబెట్టి చూర్ణించి సమముగ పిల్లితేగలచూర్ణము గలిపి ఆవుపాలలోవైచి పుచ్చుకొనిన మిక్కుటముగ వీర్యవృద్ధిచేయును.

3 నేలగుమ్మడి కల్కములో నెయ్యి తేనె కలిపి ఆవుపాలు త్రాగవలెను.

4 రావిపళ్ళను నీడను ఆరబెట్టి చూర్ణించి పంచదారకలిపి ఆవుపాలతో సేవింపవలెను.

5 ఉసిరికాయ చూర్ణమును ఉసిరికాయలరసముచే 21 సార్లు భావనచేసి నెయ్యి తేనె పాలు పంచదార వీనితో సేవించవలెను.

6 అతిమధుర చూర్ణము నెయ్యి తేనె గలిపి తిని పాలు త్రాగవలెను.

7 ఉసిరికపళ్ళ చూర్ణము పల్లేరు విత్తుల చూర్ణము తిప్పసత్తు సమములుగ గ్రహించి శర్కర నెయ్యి కలిపి భక్షించవలెను.

8 బూరుగువేరుపట్ట నేలతాడిగడ్డ శర్కర నెయ్యి ఆవుపాలలో గల్పి త్రాగేది.

9 పిప్పళ్ళు ఉసిరికవరుగు సమముగ చూర్ణించి ఆచూర్ణమును ఉసిరిగపళ్ళరసముచే భావనచేసి తేనె నెయ్యి కలిపి తిని పాలు త్రాగవలెను.

1 జాపత్రి జాజికాయ తెల్లచందనము కుంకుమపువ్వు పిప్పళ్ళు అక్కలకర్ర శొంఠి లవంగములు యివి సమభాగములు. అన్నిటిలో సగము శుద్ధిజేసిన నల్లమందు గలిపి చూర్ణముజేసి మాషప్రమాణమును తేనెతో సేవించిన వీర్యము స్తంభించి మిక్కుటముగ రతిసౌఖ్యమునిచ్చును.



జాజికాయ జాపత్రి లవంగాలు గంజాయి కుంకుమపువ్వు పచ్చకర్పూరము కస్తూరి నల్లమందు ఇవి ప్రత్యేకము 1 చిన్నము గ్రహించి తేనెతో మెత్తగా నూరి శనగలంత మాత్రలుచేసి సాయంకాలమందొక మాత్రవేసుకొని పాలుద్రాగిన నిస్సంశయముగ వీర్యము స్తంభించును.

### —♦ మధుస్నుహీరసాయనము. ♦—

త్రిఫలములు త్రికటుకములు త్రిజాతములు వాము కురాసానివాము చిత్రమూలము జీలకర్ర దుంపరాస్నము గంటుభారంగి పిప్పళ్ళు చవ్యము ధనియాలు మెంతులు నల్లజీలకర్ర జటామాంసి చెంగల్వకోష్టు పట్టివేరు సుగంధిపెన్నేరు నేలతాడి ప్రత్యేకం 1 తులము, అన్నిటికిసమము ఫిరంగిచెక్క వీని సన్నిటిని మెత్తగచూర్ణించి అన్ని చూర్ణములకు రెట్టింపు పంచదారపాకము పట్టి అందు పైచూర్ణమును వేసి పాకముచేయుచు చూర్ణములో 4 వ వంతు ఆవునేయి నేతికి నాల్గవవంతు తేనెకలిపి భద్రపరచేది. మోతాదు అరతులం. గుణము. అఖండధాతువృద్ధి కలుగుటయేగాక బలము ఆరోగ్యము కాంతికలుగును.

### —♦ మదనమంజరీవటి. ♦—

అభ్రకసిందూరము 4 తులములు, వంగభస్మము 2 తు॥ చంద్రోదయము 1 తు॥ మూడిటికి సమము

గంజాయి చాతుర్జాతకములు జాజికాయ నల్లమిర్యాలు సన్నపిప్పళ్లు శొంఠి లవంగములు జాపత్రి యివి ప్రత్యేకము 2 తు॥ వీని నన్నిటిని చూర్ణించి దానికి సగమునంతు కలకండచూర్ణము కలిపి నెయ్యి తేనె వేసి కలిపి మాత్రలుచేసి సేవించి కాచిన ఆవుపాలను త్రాగుచుండిన అమిత దేహబలము సంభోగశక్తి ఉత్సాహము శరీరకాంతి కలుగును.

—♦ కామదేవరసము. ♦—

రజతము 1 తు॥ వజ్రము 2 తు॥ స్వర్ణము 3 తు॥ తామ్రము 4 తు॥ రసము 5 తు॥ గంధకము 6 తు॥ లోహము 7 తు॥ కలబందరసముచే మర్దించి కాచకుప్పెలో బోసి మూతిమూసి చీరచేసి బాగుగా యెండించి పిదప ఒక కుండను గ్రహించి కంఠమువరకు సైంధవలవణమును పూరించి అందా కాచకుప్పెను బెట్టి పైన కుండను బోర్లించి చీరచేసి పొయ్యిమీదనుంచి కమలాగ్నిచే నొకదినమువండి ఔషధమును గ్రహించి జిల్లేడుపాలు పెన్నేరు దురదగొండివిత్తులు నేలతాడిగడ్డ పెద్దపల్లేరు పిల్లిపీచర తామరదుంప తుంగముస్తలు రెల్లువేరు వీనిరసములతో ప్రత్యేకము 3 దినములు మర్దించి దీనికి 8 వ భాగము కస్తూరి శొంఠి మిర్యాలు పచ్చకర్పూరము తక్కోలాలు యేలకులు లవంగము వీనిచూర్ణము చేర్చి భద్రపరచునది. ఇట్లు



తయారుచేసిన ఔషధమునందు ఒకతులము గ్రహించి అందు 1 తులము పంచదార కలిపి ఆవుపాలతో నెల సేవించిన శరీరకాంతి బలము తేజస్సు యివి కలుగుటయేగాక అమితసంభోగ పటుత్వము కలుగును,

—♦ విషప్రకరణము. ♦—

స్థావరవిషము, జంగమవిషము, కృత్రిమవిషము. సంయోగజవిషము అని విషములు 4 విధములు.

నాభి, పాషాణము, గన్నేరు, ఉమ్మెత్త, ముషిణి, నల్లజీడి, జిల్లేడు, పొత్తిదుంప, జెముడు, గురువింద మొదలగునవి స్థావరవిషములు.

పాము తేలు జెర్రి సాలీడు వెర్రికుక్క వెర్రినక్క ఎలుక మొదలగునవి జంగమవిషములు.

స్త్రీపురుషులు అన్యోన్యప్రీతి నిమిత్తమై గోళ్ళు రక్తము మాంసము రేతస్సు కీటకములు వీనిని చేర్చిన ఔషధములను ఆహార పదార్థములో కలిపిగాని ప్రత్యేకముగగాని తినిపింతురు ఇది కృత్రిమవిషము.

నూనె కర్పూరము నిమ్మకాయల రసము యీమూటిని కలిపి త్రాగిన చంపును. తేనె నెయ్యి సమముగ కలిపినను కొబ్బరినీళ్ళు కర్పూరము కలిపినను మిరియములు చేదుసారవేరు కలిపినను విషములగును. ఇది సంయోగజము.

వాంతి భ్రమ మూర్ఛ అతిసారము శూల వణకు

కాస శ్వాస తీవ్రదాహము గద్గదస్వరము మొదలగు నవి స్థావరవిషభక్షణమువల్ల కలుగును.

జ్వరము ఎక్కిళ్ళు పండ్లుపులిసియుండుట గొంతు పట్టియుండుట నోట నురుగు వాంతియగుట అరోచకము శ్వాసము మూర్ఛ ఇవిజంగమవిషలక్షణములు.

పాషాణవిష చికిత్సలు:—పైడిపత్తిగాకు పువ్వు కాయలరసము (2) కాకరాకురసము (3) వెలగపండ్ల రసము ఇది పాషాణవిషమును దింపును. వెంటనే వాంతి చేయించుట హితకరము. పాషాణమిశ్రౌషధసేవచే దేహము ఉబ్బినచో పనసచెక్క కషాయమును కొన్నిదినములు త్రాగించవలెను.

నాభివిషమునకు:—పైడిప్రత్తికాయల రసం. (2) చిరివేళ్ళరసం. (3) నల్లజీరరసం.

గన్నేరువిషమునకు:—పంచదారకలిపిన పెరుగు (2) గేదెపాలు జిల్లేడువేరుచెక్క. (3) కరక్కాయరసం.

గుంజావిషమునకు:—చిర్రివేళ్ళరసము పాలు పంచదార కలిపి పుచ్చుకొనవలెను.

నేపాలములకు:—ధనియాలరసం పంచదార పెరుగు

ఉమ్మెత్తవిషమునకు:—వెలిగారము తుత్థము నేతితో కలిపి ఇచ్చి వాంతిచేయుట (2) శొంఠి.

భల్లాతక విషమునకు:—చిర్రివేళ్ళ రసములో వెన్న కలిపి పూయుట.



విషముష్టికి:—చిర్రివేళ్ళరసము.

జెముడునకు:—దాల్చినచెక్కరసము.

పొత్తిమంపకు:—శొంఠిరసము.

జిల్లేడువిషమునకు:—పాలు పంచదార.

—♦ సర్పవిషము. ♦—

భ్రాంతి మూర్ఛ అతిసారము శూల వాంతి వణుకు కాస శ్వాస తీవ్రమైన దాహము హీనస్వరము ఇవి సర్పదష్టలక్షణములు.

1 నేపాళపుగింజల గుంజును 21 సార్లు నిమ్మపండ్ల రసముచేత భావనచేసి గుటికచేసి సర్పదష్టునకు ఉమ్మితో చాది అంజనము వేసిన సర్పవిషము హరించును.

2 కుంకుమపువ్వొక భాగము మిరపగింజలు 4 భా॥ మిరియాలు 1½ భా॥ నిమ్మపండ్లరసముచేత నూర్దించి కణికచేసి కలితో చాది కన్నులలో పెట్టిన పాము విషము హరించును.

3 పిప్పళ్ళు మిరియములు చెంగల్వకోష్టు కలిభూపము మణిశిల త్రాళకము తెల్లావాలు గోరోజనము సమముగా నూరి కణికలుచేసి అంజనము లేపనము పానము చేసిన సర్పవిషము హరింపును.

4 చేమంతిసగ విత్తులు కానుగవిత్తులు చేదుబీర విత్తులు ఉమ్మెత్తవిత్తులు సమముగా గోమూత్రముతో నూరి గోమూత్రములోనే కలిపి త్రాగించవలెను.

6 వెలిగారము పసుపు నీళ్ళలో కల్పి త్రాగించేది.

7 జిల్లేడువేరు సైంధవలవణము నరమాత్రముతో పుచ్చుకొనిన సర్పవిషము హరించును.

8 పసుపు మానిపసుపు మణిశిల తాళకము కుంకుమపువ్వు తుంగముస్తలు వీనిని జలముతో నూరి అంజనము చేసిన సర్పవిషము హరించును.

—♦ వృశ్చికవిషము. ♦—

కుట్టినతోడనే నిప్పున కాలినవిధముగ మంట గలిగి శీఘ్రముగ కుట్టినచోటనుండి విషము పైకి వ్యాపించి పిమ్మట కొంతసేపటికి కుట్టినచోటుకి జేరినయడల తేలుకుట్టిన విషంబని యెరుంగవలయును.

తేలు కుట్టినవారికి రొమ్ము ముక్కు కంఠము ఇవి యడచికొనియున్నను కుట్టినచోట నుండి మాంసం బూడి పడుచు వేదన గలిగినను అసాధ్యము.

1 పుత్రజీవిగింజలు మోదుగగింజలు కానుగుగింజలు నీళ్ళలో నూరి రాచిన బాధతగ్గును.

2 మైనమును బొంతజెముడుపాలతోను తెల్లజిల్లేడుపాలతోను ఏడేసిమార్లు భావనజేసి గాజుపాత్రలో భద్రపరిచి కుట్టినస్థలమున రాచి అగ్నితో కాచిన విషమ్ము హరించును.

3 తెల్లజిల్లేడుపాలు నెయ్యి కలిపి వ్రాయవలెను.

4 నాభిని నీళ్ళతో అరగదీసి వేయవలెను.



5 గన్నేరుగింజల తైలమును లేపనము జేసినయెడల తేలువిషము తప్పక హరించును.

—♦ కుక్కవిషము. ♦—

కుక్కవిషము శరీరమున వ్యాపించిన తరువాత నిద్ర కునికిపాటు బడలిక తాపము అజీర్ణము గగురుపాటు కాపు అతిసారము శీతభయము మతిచాంచల్యము మొదలగు గుణములు గలిగియుండును.

1 బెల్లము నూనె జిల్లేడుపాలు వీని నేకముజేసి లేపముజేసిన కుక్కవిషము హరించును.

2 గానుగచెట్టువేరుచెక్క ౦ము 3 తు॥ చొప్పున 5 దినములు ఉదయపు పూటల నిచ్చిన వెర్రికుక్క నక్క విషములు హరించును. పులుసుకూడదు.

3 వెర్రికుక్క కరచిన 2 వారములలోపుగ ఉదయము 6 గంటల వెనుక చిన్నగరిటెడు భాగ్గుచూర్ణము తినిపించి అరఘంట వెనుక నల్లఉమ్మెత్తాకు రసము 2½ తు॥ త్రాగించవలయును. ఇచ్చిన వెనుక కొంచెము తాటిబెల్లముగాని మరియేదయిన వాంతిరాకుండ నుండుటకు తినిపించవలయును. ఆ వెనుక నా మనుష్యుని యెండలో 4, 5 ఘంటలవరకు కట్టియుంచిన ఆమనిషి వెర్రియెత్తి వెర్రికుక్కవలె అరవడము మొదలగు పిచ్చిపనులు జేయును. మధ్యాహ్నమందు ఆమనిషి నెత్తిమీద 100 బిందెల చన్నీళ్లు పోయవలె

యును. తరువాత పందిమాంసము ఉప్పువేసి వంకాయలు మొదలైనవి వండి ఆహారమివ్వవలెను. తరువాత తేలిక ఆహారము ఇయ్యవలయును. ఈలాగున జేసిన వెఱ్ఱికుక్క విషము నిశ్చయముగ నివర్తించును.

—♦ మూషికవిషము. ♦—

కాటునుండి రక్తము వెడలుట, పాండువర్ణంబులైన పొడలు జ్వరము అరుచి రోమాంచము తాపము ఇవి మూషిక విషలక్షణములు. మూర్ఛ శరీరము రంగుమారుట చెమట చెముటు జ్వరము తలబరువు నోట జొల్లుగారుట రక్తవాంతి ఈలక్షణములు కలిగిన అసాధ్యము.

1 మణిశిల తాళకము చంగల్వకోష్ఠు వీని వావిల్లాకురసముతో నూరి గురిజెత్తు మాత్రలుజేసి సేవించిన ఎలుక విషము నివర్తించును.

2 చింతగింజలు కరిధూపము ఈ రెంటిని నూరి పాతనేతితో కలిపి తినవలెను.

—♦ కృత్రిమవిషము. ♦—

ఈవిషము దేహమున జీర్ణించిన 15 దినములకు గాని 1 మాసమునకుగాని విషమెక్కి బాధించును. ఆలస్యము జాడ్యము దగ్గు ఉబ్బరము బలక్షయము రక్తస్రావము జ్వరము శరీరమునందు వాపు నేత్రములందు [illegible] ఇవి కృత్రిమవిషలక్షణములు



1 రసము సువర్ణము హేమమాక్షిక భస్మము యీ 3 కి సమము గంధకమును కలిపి 1 దినము కలుబందరసముచేత మర్దించి నీడను యెండించి మాష ప్రమాణము పంచదార తేనె యనుపానముతో సేవించి వెంబడిగ పాలలో చిత్రమూలం నలచి కాచి త్రాగిన కృత్రిమవిషము హరించును. మాసము సేవించేది.

2 పుత్రజీవి ఫలములలోని గుంజును నిష్క ప్రమాణము ఆవుపాలతో త్రాగవలెను.

3 అడ్డసరము నేలవేము చేదుపొట్లాకు ఒక్కొక పలముదంచి 24 పలములుదకముబోసి నాలుగవ భాగము కషాయము కాచి దానికి సమము ఆవునెయ్యి నేతికి సమము కరక్కాయలరసము కలిసి చిక్కగవండి సేవించవలెను.

4 ఏలకులు తాళీశపత్రి త్రికటుకలు జీలకఱ్ఱ సమముగ చూర్ణించి పంచదార తేనెతో సేవించవలెను.

—♦ సంయోగజవిషము. ♦—

కాకమాచి దింతెన పొన్న బోడతరము వీనిలో దేనిరసము పానముజేసినను విషము హరించును.

బాలరోగ ప్రకరణము.

—♦ అమపాచనీచూర్ణము. ♦—

జాజికాయ $7\frac{1}{2}$ తు॥ దాల్చినచెక్క 10 తు॥ లవంగాలు $2\frac{3}{4}$ తు॥ యాలకులు $2\frac{1}{2}$ తు॥ పంచదార $62\frac{1}{2}$

తు॥ నీమనున్నము 27½ తు॥ చూర్ణించి అన్ని చూర్ణ
ములకు 8 వ వంతు పురినాపువ్వు సోడా 4 వ వంతు
కలిపి చిన్నం మొదలు 2 చి॥ వరకు చనుబాలతో ని
చ్చిన అజీర్తి తగ్గును.

—♦ కడుపుబ్బరమునకు. ♦—

ముక్కుసజొన్నలను పిండిచేసి అడవిచామంతిఆకు
రసముతో తడిపి వాసెనమీాదవండి తులం మొదలు
2 తు॥ వరకు ప్రతిదినము తినిపించుచుండవలెను.
పిల్లలకు కడుపు మిక్కిలిపెరిగి కాళ్ళు చేతులు సన్న
గిలి రక్తక్షీణమై పాండువు సంజు ఆయాసము గలిగి
నచో తక్షణము తగ్గును. 7 దినములవరకు చేసిని
వాడవలెను. చమురుపదార్థములు పులుసు వర్జం.

—♦ కామెర్లకు. ♦—

రెడ్డివారినానబాలు కాకరాకు కొండపిండిఆకు స
ల్లయుమ్మెత్తాకు సలిపి పాలలో 10 చుక్కలు పిండి
త్రాగించేది. పథ్యం—పాలు అన్నము 3 దినములు.

—♦ జిగటవిరేచనములకు. ♦—

పొంగించిన ఇంగువ 5 భా॥ నల్లమందు 1 భా॥
కలిపి నూరి పెసరగింజంత మాత్రలనుచేసి దాల్చినిచ
క్క లేక గసగసాల రసముతో యిచ్చిన జిగటవిరేచ
నములు కట్టును. 5 మాత్రలకన్న హెచ్చు వాడ
నక్కరలేదు.



—♦ మేహకారకమునకు దరదచూర్ణము. ♦—

ఇంగిలీకపు ముక్కను నిమ్మపండులోపెట్టి పుట
పాకంచేసి ఒక మూకుడులో సాంబ్రాణిచూర్ణమును
పరచి అందు హారతికర్పూరపు బిళ్ళలను పరచి దానిపై
యింగిలీకపు ముక్కనుపెట్టి దానిపైన హారతికర్పూ
రమును పోసి అందుపైన సాంబ్రాణిపొడి చల్లి నిప్పు
ముట్టించవలెను. కాలుచున్నప్పుడు కొంచెము తేనె
చిలుకుచు పారలించి తీసి ముక్కనుచూర్ణించి గుం
జెత్తు మొదలు చిన్న మెత్తువరకు తాటికలకండ చూర్ణ
ముతో యిచ్చిన మేహకారకములు శరీరము జ్వరము
వచ్చినట్లుండుట నివర్తించును. అన్నహితము కలు
గును. జీర్ణశక్తి రక్తవృద్ధి కలుగును.

—♦ కోరింత దగ్గునకు. ♦—

1 తెల్లమిరియాలు యష్టిమధుకము పొంగించిన
వెలిగారం సమముగా గ్రహించి కలుబంద రసముతో
మర్దించి కుంకుడుగింజంత మందును రేగుచెక్క రస
ములో కలిపి రోజునకు 2 పూటల నిచ్చుచుండిన 5
దినములను కోరింతదగ్గు తగ్గును.

—♦ సిందూరాదిమాత్ర. ♦—

ఇంగిలీకము రససిందూరము రసకర్పూరము సమ
ముగ గ్రహించి తేనెతో మర్దించి పెసరగింజలంత
మాత్రలు చేసి ఆముదములో ముంచి మింగించిన

మొదలు విరేచనమై కడుపుబ్బరము జ్వరము తగ్గును. మత్తు తగ్గును. శరీరమునకు మంచివేడి నిచ్చును.

### కస్తూరిమాత్రలు.

కస్తూరి జున్ను గోరోచనము పావుదార రాయపీత రససిందూరము నల్లమందు ఇంగువ ప్రత్యేకము చిన్న మొత్తు చిత్రమూలం 4 చి॥ నాభి 2 చి॥ చిత్రమూలం గుంటగలగర రసములతో మర్దించి పెసరగింజలవలె మాత్రలుచేసి ఒక్కొక్క మాత్ర చొ॥ ప్రతిసాయంత్రము పిల్లలకు వాడుచుండిన జలుబు దగ్గు అజీర్ణము ప్రక్కలు నెప్పగనుండుట తగ్గును.

### చంటిబిడ్డ గుణములకు

తెల్లజిల్లేడుఆకు పసరును ముక్కు రంధ్రములలో రెండుమూడు చుక్కలను పిండవలెను. వెంటనే బిడ్డకు తెలివివచ్చును. మరియు నీరుల్లిపాయను నమిలి చెవులలోను ముక్కులోను ఊదవలెను. నొసట గిల్లవలెను. ఇట్లు చేసినను తెలివిరాక శిశువుని శ్లేష్మమై యున్నచో ముఖమందును, రొమ్మునందును రక్తవేయవలెను. పైజెప్పిన చొ॥ శిశువునకు తెలివివచ్చిన పిదప గుంజమొదలు 2 గుంజలు లేక మూడుగుంజలు తామ్రభస్మమును కొద్దిగా శర్కరచేర్చి చనుబాలలో కలిపి త్రాగించి వమనమగునట్లు చేయవలెను. ఇట్లు రెండు వమనములైనపిదప అజీర చక్కర



ణములో జెప్పబడిన అగ్నికుమారమునుగాని, త్రైలోక్యచింతామణినిగాని, కస్తూరిమాత్రనుగాని జామునకు ఒక మోతాదు చొ॥ యిప్పించుచుండవలెను.

### సిద్ధామృతరసం.

రసకర్పూరం గంధకం మృద్దారుశృంగి ప్రత్యేకము 1 భా॥ అన్నిటికి సమం వాకుడువేళ్ళపట్ట (పచ్చిది) వీనిని కోడిగ్రుడ్డు రసంతో మర్దించి గుంజాప్రమాణం మాత్రలుచేసేది. వీనిని బిడ్డలకు వాడవలెను. జలుబు దగ్గు జ్వరము నివారణయగును.

### క్రిములకు.

1 గచ్చపలుకు పిప్పళ్లు సైంధవలవణము వీనిని సమభాగముగ గ్రహించి అందు మొదటి రెంటను ఆముదముతో దోరగవేయించి 3 చేర్చి మంచినీళ్ళతో మర్దించి పెసరగింజలంత మాత్రలుచేసి ఇచ్చినచో పూర్తిగా క్రిములునశించును.

### దగ్గులకు.

1 వసకాల్చినమసి రససిందూరము శొంఠి సమముగ చూర్ణించి చి॥ ౧ తేనెతో యిచ్చిన దగ్గు తగ్గును.

2 తాళకం పటికి రెండు సమభాగములుగ కలబందరసముతో నూరి 10 పిడకలతో పుటముపేయవలెను. మోతాదు వడ్లగింజెత్తు. అనుపానం తేనె.

3 రసకర్పూరము రససిందూరము ఇంగిలీకము కాలిమెల్ యివి సమభాగముగ గ్రహించి మెత్తగా చూర్ణి యుంచుకొనవలెను. మోతాదు. గుంజెత్తు మొదలు 3 గుంజలెత్తువరకు.

—♦ విరేచనములు కట్టుటకు. ♦—

గవ్వపలుకుసాంబ్రాణి $1\frac{1}{3}$ తు॥ హారతికర్పూరం 2 తు॥ ఇంగిలీకము $\frac{1}{4}$ తు॥ రససిందూరం $\frac{1}{3}$ తు॥ నల్లమందు $\frac{1}{4}$ తు॥ వీనిని మెత్తగానూరి పెసరగింజలంత మొదలు కందిగింజలంతవరకు మాత్రలుచేసియిచ్చేది.

—♦ బోళబద్ధవటి. ♦—

ఇంగిలీకం మృద్దారుశృంగి రససిందూరం ప్రత్యేకం 1 తు॥ బాలింతపోలు 3 తు॥ మంచినీళ్ళతో నూరి కందిగింజంత మాత్రలుచేసి యిచ్చేది. గుణము:— అతిసారము గ్రహిణి అజీర్ణము కుదురును.

—♦ యకృత్ ప్లీహావృద్ధులకు. ♦—

సత్తునుకరిగించి యిప్ప నూనెలో యేడుసారులు చల్లార్చిన శుద్ధమగును. ఇట్లు శుద్ధమైన సత్తును యినుపమూకుడులోవేసి కరిగించి నేలయుసిరిగ సమూలముతో వేల్చినయెడల తెల్లగ భస్మమగును. దీనిని గుంజెత్తు మొదలు రెండుగుంజలెత్తు వరకు ఆముదముతో గాని తేనెతో గాని యివ్వవలెను.



—♦ హింగుళాదిగుటిక. ♦—

ఇంగిలీకము $\frac{1}{3}$ తు॥ రసకర్పూరము $\frac{1}{3}$ తు॥ రససింధూరము $\frac{1}{3}$ తు॥ వెలిగారము 4 తు॥ నేపాలములు 1 తు॥ ఆముదపుపప్పు 4 తు॥ అల్లపురసముతో ఒకదినము నూరి కందిగింజలంత మాత్రలుచేసి వాడవలెను. అనుపానం:—వరిగడ్డికషాయము బల్లలుకరుగును.

—♦ గుడపిప్పలి. ♦—

వాయువిడంగములు త్రికటుకములు చెంగల్వకోష్టు యింగువ పంచలవణములు వెలిగారము యవక్షారము సర్జక్షారము సముద్రపునురుగు చిత్రమూలము గజపిప్పళ్లు నల్లజీలకర్ర ప్రత్యేకం 1 తు॥ గుమ్ముడుతీగ ఉత్తరేణు చింతబెరడు వీని క్షారములు ప్రత్యేకము 1 తు॥ అన్నిటికి సమము పిప్పలిచూర్ణము చూర్ణమునకంతకు రెట్టింపు పాతబెల్లము రోటిలోవేసి మర్దించి మాత్రచేసివాడవలెను. గుణము:—యకృత్ ప్లీహాలు పంచగుల్మములు ఉదరముజీర్ణజ్వరము శోధశ్వాస శమించును.

శుద్ధిప్రకరణము.

—♦ రసము. ♦—

రసమునందుగల మలము అగ్ని విషము చాపల్యము గౌరవము అను స్వాభావిక దోషములును జల భూపర్వత నాగ వంగాదిసప్త కంచుకదోషము

లును నివర్తించుటకు స్వేదనము మర్దనము మూర్ఛనము ఉత్థాపనము పాతనము నిరోధము నియమనము దీపనము అను 8 సంస్కారములు చేయవలెను.

—♦ స్వేదనము. ♦—

ఆవాలు శొంఠి పిప్పళ్ళు మిరియాలు ఉప్పు పసపు త్రిఫలములు అల్లము కలబంద చిత్రమూల వీని నన్నిటినిగాని కొన్నిటినిగాని కలితో మెత్తగానూరి ఆముద్దయొక్క మధ్యమందు రసముంచి గుడ్డతో మూటగట్టి ఒక భాండమందు సౌవీరమునుపోసి దానికి తగులకుండ యీమూటను వ్రేలాడగట్టి 1 దినము వండిన స్వేదన సంస్కారమనబడును.

—♦ మర్దనము. ♦—

కరిధూపము శొంఠి పిప్పలి మిరియాలు బెల్లము పసుపు తెల్లావాలు ఇటుకపొడి పులిచల్ల ఉప్పు పెరుగు ఉన్మత్త చిత్రమూలము వీనిని రసమునకు 16వ భాగంతుచేర్చి ప్రత్యేకముగా కాంజికముపోసి నూరుట మర్దన సంస్కారము.

—♦ మూర్ఛనము. ♦—

కలబంద త్రిఫలములు చిత్రమూలము వీనితో 7 దినములు నూరిన మూర్ఛనమనబడును.

—♦ ఉత్థాపనము. ♦—

స్వేదన మర్దన మూర్ఛన సంస్కారముల నొందిన



రసమును వేడినీళ్ళతో నైనను వేడి కాంజికముతో నైనను కడుగుట ఉత్థాపనము.

—♦ ఊర్ధ్వపాతనము. ♦—

తామ్రభస్మమును పాదరసమును కలిపి కలితో నూరి ముద్దజేసి దాని నొక మృత్పాత్రయందుంచి పైనమూకుడుమూసి చీలజేసి పొయ్యిమీద నుంచి క్రింద మంటబెట్టిన రసమెగసి పైకుండకుపట్టును ఇది ఊర్ధ్వపాతన సంస్కారము.

—♦ తిర్యక్పాతనము. ♦—

పాదరసము ధాన్యాభ్రకము వీనిని సమభాగముగ కాంజికముతోనూరి యాముద్దనొక కుండలోనుంచి పైనొకకుండమూసి చీలజేసి రసముగల కుండను పొయ్యిమీద నడ్డముగానుంచి మంటబెట్టిన రసమెగిరి రెండవకుండలో బడును. ఇది తిర్యక్పాతనము.

—♦ అధఃపాతనము. ♦—

ఆవాలు ఉప్పు మునగవిత్తులు కరక తాడి యుసిరిగలు వీనినెల్ల కాంజికముపోసి పాదరసముతో జేర్చి నూరి యాముద్ద నొకకుండకుపూసి దానిని తలక్రిందుగత్రిప్పి దానిముఖమును మరియొక కుండలో బెట్టి చీలజేసి క్రిందికుండ మునుగునట్లుగ బురదగోతిలో పాతిబెట్టి పైన పిడకలతో పుటముబెట్టిన రసము క్రిందికుండలోనికి దిగును. ఇది అధఃపాతనము.

—♦ రోధనము. ♦—

కుండయందు ఉప్పునుపోసి అందు పాదరసము నుంచి నీళ్ళుచల్లి పైనమూకుడుమూసి సంప్రదాయములనెరింగి లఘుపుటమువేసిన రోధన సంస్కారము

—♦ నియమనము. ♦—

రాతియుప్పు వేపచెక్క క్షీరకాకోళి గోష్ఠకాకరదుంప గోధుమలు తామరదుంప సర్పాక్షి తిప్పతీగ వీనిలో దొరికినంతవరకు వస్తువులను పాదరసముతో చేర్చి నూరి కాంజికముతో డోలాయంత్రమున 3 దినములు స్వేదనముచేసిన నియమనసంస్కారమగును.

—♦ దీపనము. ♦—

సైంధవ సౌవర్చ బిడా సముద్ర కాచలవణములు ధాన్యాభ్రకము వెలిగారము యవక్షారము సర్జక్షారము ఆవాలు చిత్రమూలము మునగవిత్తులు గోష్ఠకాకరదుంప పాతాళగరుడి వాసపాములు క్షీరకాకోళి చెరుకు జీలుగ తెల్లదింటెన అన్నభేది దింటెన కలబంద పిప్పళ్ళు కరక్కాయలు నేలతాడి తక్కాలి మిరియములు వీనిని దొరికినంతవరకు రసమునకు సమముగ గ్రహించి నిమ్మ దానిమ్మ నారింజ పుల్లప్రబ్బలి మాదీఫలము సెనగపులుసు చింత పులిచింత రసములచే మర్దించి డోలాయంత్రమున 3 దినములు స్వేదనముచేసిన దీపసంస్కారము.



—♦ ఇంగిలీకమునుండి రసముదీయువిధి. ♦—

ఇంగిలీకమును తెల్లబాడిదఆకు రసముచే నూరి బిళ్ళచేసి యాబిళ్ళనొక కుండయందుంచి పైమూకుడుమూసి సంధిబంధము గావించి పైమూకుడుపైన పేడతో గురుగుకట్టి చన్నీళ్ళుపోసి క్రింద మంటబెట్టిన యెడల రసము పైమూకుడునకు పట్టును. దానిని జాగ్రత్తగవిప్పి తీసుకొనవలెను.

2 వ విధము.

ఇంగిలీకమును పాత్రగుడ్డలో చుట్టి ఒకపళ్ళెము నందు చిన్నచిన్నరాళ్ళను పొయ్యిగడ్డలవలె పెట్టి అందు ఇంగిలీకపుచుట్టనుబెట్టి నిప్పుముట్టించి చిన్నచిన్న చిల్లులుగల యొకకుండను పైన మూసియుంచవలెను కొంతసేపటికి రసము పళ్ళెములోనికిదిగును. ఇది మిక్కిలి సులభమైన ప్రక్రియ.

—♦ 8 మహారసములు.

అభ్రకము వైక్రాంతము మాక్షీకము విమలము శిలాజతు తుత్థము చపలము కఫరి.

—♦ వజ్రాభ్రకశుద్ధి. ♦—

కొలిమిలోనుంచి కాల్చినయెడల బుసకొట్టక దుముకులాడక పొరలు లేచి నశించిపోక స్వచ్ఛమైన కాంతి గలిగియుండునది వజ్రాభ్రకము ఇది శ్రేష్ఠము తక్కినవి రోగముల బుట్టించును. గనుక

వజ్రాభ్రకమును పరీక్షించి గ్రహించి బాగుగా కాల్చి రేగువేళ్ళకషాయము గోమూత్రము ఆవుపాలు అను వానిలో ప్రత్యేకముగ చల్లార్చి రేకులుగదీసి భద్రపరచవలెను. ఈరేకులను చర్రియాకు చింతాకు రసములలో 1 రోజు భావనచేసిన శుద్ధియగును.

—♦ వైక్రాంతశుద్ధి. ♦—

వైక్రాంతమును ఉలవకషాయముతో స్వేదనము చేసి పిదప కొలిమిలోగాల్చి గుఱ్ఱపు మూత్రమునందు 14 సార్లు చల్లార్చిన శుద్ధమగును.

—♦ హేమమాక్షికశుద్ధి. ♦—

డోలాయంత్రమున ఆముదము మాదీఫలరసం అరటిదుంపరసములతో ప్రత్యేకముగ 2 ఘడియలు చొప్పున స్వేదనముచేసినను కాల్చి త్రిఫలాకషాయమున చల్లార్చినను శుద్ధమగును.

—♦ విమలశుద్ధి. ♦—

అడ్డసరము గలిజేరు వావిలి యనువాని రసములలో 1 దినము ఉడికించిన శుద్ధియగును.

—♦ శిలాజిత్తుశోధనము. ♦—

శిలాజిత్తును సర్జక్షారము యవక్షారము వెలిగారము నిమ్మపండ్లరసము గుగ్గిలము వీనిలో నొక దినము భావనచేసి పిదప ఒకగడియ స్వేదనముచేసిన శుద్ధియగును. లేక గుంటగలగరరసము గోమూత్రము



త్రిఫలా కషాయము వీనితో నూరి ఇనుపపాత్రయందుంచిన శుద్ధియగును.

—♦ తుత్థశుద్ధి. ♦—

పెరుగుతో నూరి వెచ్చజేసినను ఆమ్లవర్గముతో నూరి గుడ్డనుజుట్టినూనెలోనుంచి అశ్వమూత్రముతో డోలాయంత్రమున 1 దినమువండినను శుద్ధియగును.

—♦ చపలము. ♦—

సున్నపునీళ్ళలోపెట్టి పుటమువేసి నీళ్ళుపోసిన శుద్ధియగును.

—♦ కఫరి. ♦—

కఫరిని పంచగవ్యములు, నిమ్మపండ్లరసము, కాంజికము, నరమూత్రము, వీనినన్నిటిని జేర్చి డోలాయంత్రమున స్వేదనముచేసి పైవస్తువులను కాంజికమును కలిపి మరల 7 సారులు భావనము చేసిన కఫరి శుద్ధియగును.

—♦ 8 ఉపరసములు. ♦—

గంధకము గైరికము కాసీసము కాంక్షికము హరిదళము మణిశిల తాళకము అంజనము కంకుష్ఠము.

—♦ గంధకశుద్ధి. ♦—

గంధకము నొకజాము ఆవుపాలతో స్వేదనము చేసి అధఃపాతన యంత్రముచే ఆవునేతిలో నొకసారి ద్రవింపజేసిన యెడల శుద్ధమగును. లేక గుంట

గలగరాకు రసములో ద్రవింపజేసి యీరసముతో 7 సారులు స్వేదనము చేయవలెను. గుంటగలగర తెల్లగలిజేరు కలబందరసము మొగలిచన్నులు నెయ్యి తేనె పాలు అనువానిలో ప్రత్యేకముగా ద్రవింపజేసినయెడల నిర్దుష్టమైయుండును. ఇట్లు అష్టశుద్ధులుచేసిన గంధకము ప్రత్యేకముగ వాడుకొనదగియుండును.

—♦ గైరికశుద్ధి. ♦—

ఆవుపాలతో 7 మారులు భావనచేయవలెను.

—♦ కాసీసశుద్ధి. ♦—

నిమ్మపండురసముతో భావనచేసిన శుద్ధియగును.

—♦ పటికశుద్ధి. ♦—

కాంజికములో 3 దినములు నానవేసిన శుద్ధమగు.

—♦ తాళకశుద్ధి. ♦—

రేకులుగావలిచి సున్నపునీరు కాకరాకురసము బూడిదగుమ్మడికాయరసము అనువానిలో ప్రత్యేకము నొకజాము స్వేదనముచేసిన యెడల శుద్ధమగును.

—♦ మణిశిలశుద్ధి. ♦—

అల్లము గుంటగలగర అగిసి రసములచే నూరుచు 7 దినములు భావనచేసిన శుద్ధమగును.

—♦ అంజనములు-శుద్ధి. ♦—

సౌవీరాంజనము రసాంజనము స్రోతోంజనము పుష్పాంజనము నీలాంజనము అని 5 విధములు వీని



ని పసుపుతో మర్దించి గుంటగలగరాకు రసముతో స్వేదనముచేసిన శుద్ధములగును.

—♦ కంకుష్ఠము ♦—.

శొంఠిరసమున 3 సార్లు భావనచేయవలెను.

—♦ సాధారణరసములు. ♦—

గౌరీపాషాణము కంపిల్లకము అగ్నిజారము నవాసాగరము గిరిసిందూరము దరదము కపర్దము (పచ్చగవ్వ) మృద్దారుశృంగము.

—♦ పాషాణ శుద్ధి. ♦—

పాషాణములను తేనెతో ఉడికించవలెను.

—♦ కంపిల్లకము. ♦—

నిమ్మపండ్లరసముతో భావనచేసినను కరక్కాయ కషాయముచే స్వేదనము చేసినను శుద్ధమగును.

—♦ ఇంగిలీకము. ♦—

నిమ్మపండురసము అల్లపురసము అనువానిలోగాని చనుబాలలోగాని భావనచేసిన శుద్ధమగును.

—♦ గవ్వ. ♦—

బేడయెత్తునకు తక్కువగాని బరువుగల పచ్చగవ్వలను కాంజికముతో స్వేదనముచేయవలెను.

—♦ మృద్దారుశృంగము. ♦—

అల్లపురసము నిమ్మపండ్లరసము అనువానిలో 3 దినములు భావనచేసిన పరిశుద్ధమగును.

### నవరత్నములు—వానిశుద్ధులు.

పద్మరాగమును (మాణిక్యమును) గుఱ్ఱపుమూత్రమున రాత్రియంతయు నానబెట్టి పగలంతయు నెండించవలెను. ఇట్లు 3 మారులుచేసిన శుద్ధమగును. ముత్యమును అమ్లవర్గముతో భావనచేసిన శుద్ధమగును. పగడమును నిమ్మపండ్లరసముతో జాము నానబెట్టి వేడినీళ్ళతో కడిగిన శుద్ధమగును. పచ్చను నేలగుమ్ముడుగడ్డలో బెట్టి మన్నుపూసి కుక్కుటపుటము పెట్టిన శుద్ధమగును. పుష్యరాగమును మేకమూత్రముతో భావనచేసిన శుద్ధమగును. వజ్రము వాకుడు వేళ్ళలోబెట్టి ఉలవకట్టుతో 7 దినములు అళ్ళికషాయముతో 7 దినములును డోలాయంత్రమున వండిన శుద్ధమగును. నీలమును గాడిద మూత్రమున నొకరాత్రి నానించి ఎండించిన శుద్ధమగు గోమేధికమును గుఱ్ఱపు మూత్రములోను నేలగుమ్ముడుగడ్డ రసములోను 3 దినములు భావనచేసిన శుద్ధమగు వైడూర్యమును గుఱ్ఱపు మూత్రమునందొక దినము గుమ్మడిపండు రసమందొకదినము భావనచేసిన శుద్ధమగును. రాజావర్తమును దిరిసెనపూవుల రసముతో భావనచేసిన శుద్ధమగును.

### లోహములు.

స్వర్ణము రజతము లోహము వంగము నాగము



సత్తు కంచు ఇత్తడి రాగి అను లోహములను కాల్చి నువ్వులనూనె మజ్జిగ గోమూత్రము కాంజికము ఉలవకట్టు అనువానితో ప్రత్యేకము 7 మార్లు చల్లార్చిన పరిశుద్ధములగును. మండూరమును తాండ్రబొగ్గులనిప్పులలో కాల్చి తాండ్రకొయ్య తొట్టిలో పోసిన గోమూత్రమున 7 మార్లు చల్లార్చవలెను.

### వత్సనాభిశుద్ధి.

వత్సనాభిని ముక్కలుగొట్టి గోమూత్రమునందు 3 దినములు నానబెట్టి 4 వ దినమున గోమయములో నుడికించి కడిగి యెండబెట్టిన శుద్ధమగును.

### విషముష్టిగింజలశుద్ధి.

కాంజికములో 3 దినములు నానబెట్టి పిదప నొకజాము కాంజికముతో స్వేదనముచేయవలెను.

### నేపాళములశుద్ధి.

నేపాళములయొక్క పైబెరడునుగొట్టి తీసి లోనిగింజను గోమయముతో నుడికించి రెండుదళములకు మధ్యనుండు ఆకులను తీసివేసి పాలు బియ్యము బెల్లము కలిపి ఉడికించి కడిగి తీసి ఆవునేతిలో దోరగ వేయించి కొంచెము పసుపు చూర్ణమును చల్లేది.

### ఉన్మత్తగింజల శుద్ధి

నిమ్మపండ్లరసములో 3 దినములు నానబెట్టేది.

## భస్మ—సిందూరప్రకరణము.

### రసభస్మము.

ఆముదపువేళ్ళు ఉన్మత్తవేళ్ళు చిత్రమూలము వీని పై కొప్పరను పాదరసముతో గలిపి కాంజికముతో మర్దించి బిళ్ళలుగాజేసి నీడనెండించి పిదప ఒకమూకుడులో ఉప్పునుపరచి అందు ఆబిళ్ళలనుపెట్టి పైన మూకుడు మూసి చీలజేసి 2 జాములు వండిన తెల్లని భస్మము పైమూకుడునకు పట్టును, దానిని భద్రముగ తీసికొనవలెను.

2 వ విధము.

పటిక 2 భా॥ పాదరసము 1 భా॥ సైంధవ లవణము 4 భా॥ చేర్చి కాంజికముతోనూరి యాముద్దను ఒకకుండలోపూసి పైన మూకుడుబోర్లించి సంధిబంధముచేసి ఊర్ధ్వపాతన యంత్రమున 2 జాములు వండినచో స్వచ్ఛమగు భస్మంబగును.

3 వ విధము.

దేవదారు విష్ణుక్రాంత అనువానిని కాంజికముతోనూరి యాసముదాయతో పాదరసమునుచేర్చి నూరి కటివలె వండిన భస్మమగును.

### అభ్రకభస్మవిధి.

వజ్రాభ్రకమును రాతిరోటిలో రుబ్బి దానినిగోనెగుడ్డలో గాని ముతకబట్టలో గాని బెట్టి అందు



కొంచెము ధాన్యముచేర్చి నీళ్ళు పోయుచు పిసికిన యెడల సన్నని యభ్రకపురేణువులు జారును. అవి క్రిందపడకుండ క్రింద కుండను పెట్టవలెను. క్రిందికుండలోనికి దిగిన చూర్ణమును ధాన్యాభ్రకమందురు. దానిని జిల్లేడుపాలతో మర్దించి పుటమువేసేది. ఇట్లు జిల్లేడుపాలు కలబంద, మేకరక్తము, గంగరావియాకు, ఆవుపాలు, మేకపాలు, గేదెపాలు, నరమూత్రము, మఱ్ఱియూడలు వీనిరసములతో నూరుచు 100 పుటములను పెట్టిన నిశ్చంద్రికముగ అభ్రకము సిందూరించును.

పండిత డి. గో వారు కుక్కపొగాకు రసముతో 10 పుటములు వేసిన భస్మమగునని వ్రాసిరి.

తేనెతో మర్దించుచు చింతబెరళ్ళతో 20 పుటములువేసిన నిశ్చంద్రికమగును.

జిల్లేడుపాలు, బోడతరము, వావిలి, అడ్డసరము, ముళ్ళతోటకూర, కసివింద, త్రిఫలకషాయము, రెడ్డివారి నానబాలు, కరవమంపరసము, నల్లేరు, తుమ్మిపు ఆకు, నిమ్మపండ్లు వీనిరసములతో ప్రత్యేకము 8 పుటములువేసిన నిశ్చంద్రికమగును.

ధాన్యాభ్రకమును నల్లేరురసముతో రుబ్బి చింతబెరళ్ళతో 10 పుటములు వేయవలెను.

—♦ వైక్రాంతభస్మవిధి. ♦—

8 వ వంతు గంధకము జేర్చుచు నిమ్మపండ్లరసముతో 8 పుటములువేసేది.

—♦ వరాటికభస్మవిధి. ♦—

ఆముదముతో నూరి 4 పుటములువేసి పిదప సైంధవలవణము కలిపి మాదీఫల రసముతో మర్దించి లోహపాత్రలో బెట్టి పుటమువేసేది.

—♦ విమలభస్మవిధి. ♦—

గంధకము కలిపి నిమ్మపండ్లరసము లేక గోమూత్రముతో నూరి 10 పుటములు బెట్టవలెను.

—♦ కర్పూరశిలాజతు భస్మము. ♦—

రాసున్నమును పొదిగి పుటమువేసేది.

—♦ తుత్థభస్మము (సున్నము) ♦—

30 తు॥ల తుత్థమును యెఱ్ఱముళ్ళ తోటకూరరసముతో నూరి 20 పిడకలలో పుటము వేయవలెను. ఇట్లు పైరసముచేత నూరుచు తడవకొక్కొక్క పిడక చొ॥ హెచ్చించుచు పుటములు వేయవలెను. 20 పుటములగునప్పటికి మిక్కిలి తెల్లగను అమితమగు కారముగను భస్మము తయారగును. ఛర్దిలేదు. మరల నల్లబడదు. వాదజ్ఞులు దీనిని వాదతంత్రమున వైద్యులు చికిత్సయందును ఉపయోగింతురు.



—♦ తుత్థసిందూరము. ♦—

కుంకుడుకాయలరసముతో తుత్థమును నూరి బిళ్ళ చేసి మూకుళ్ళలోనుంచి గట్టిగ చీలజేసి 15 పిడకలలో పుటమువేసిన యెఱ్ఱగ కుంకుమవలె సింధూరించును. మోతాదు:—గురుంజెత్తు. కఫవ్యాధులలో సెగరోగములకు పనికివచ్చును.

—♦ చపలభస్మము. ♦—

దీనిని మారణముచేయు వాడుక లేదు.

—♦ కర్పరిభస్మము. ♦—

5 వ వంతు తాళకమును చేర్చి లోహపాత్రలో నుంచి గరిటెతో కదుపుచు వండేది.

—♦ కాసీససిందూరము. ♦—

నిమ్మపండ్ల రసమున నూరి పుటంవేసేది.

కట్టెంపు సురాకారంకల్పి నిమ్మపండ్ల రసముతో నూరి పుటమువేసేది.

—♦ తాళకభస్మవిధి. ♦—

తాళకమును తెల్లమద్ది బూడిదలో పెట్టి మూకుడులో నిడి 4 జాములు వండిన భస్మమగును.

—♦ తాళకభస్మము. ♦—

రావిచక్కను కాల్చి తెల్లగ బూడిదచేసుకొని యుంచుము. తాళకమును మోదుగుచెక్క రసముతో నూరి కుంకుడుగింజలవలె మాత్రలుచేసి మండించుము.

నెరవాపు బియ్యపుగంజిని భద్రపరచుకొనుము. యీ గంజిలో తాళకమాత్ర నొక్కొక్కటిగ ముంచి బూడిదలో పొలుపుము. అది యెండిన వెనుక మరల గంజిలోముంచి బూడిదలో పొలుపు చుండుము. యించుమించుగ చిన్న వెలక్కాయంత లేసి ఉండలైన వెనుక వాటిని కొలిమిలోనుంచి యొకజాము గాఢాగ్నిచే నూదుము లేదా ఒకగజపుటమువేయుము. చక్కగ ఉండలను పగులగొట్టి లోపలనుండు స్వచ్ఛమగు తాళకభస్మమును గ్రహింపుము. మోతాదు:—వల్లగింజయెత్తు. కుష్ఠము మొదలగు చర్మరోగములు క్షయమొదలగు మొండిదగ్గులు లె దినములకు పైన నిలువవు. అత్యుత్తమ యోగము. వాదజ్ఞాలకును ఉపయుక్తము.

## —♦ తాళకసిందూరము. ♦—

పత్రతాళకము శ్వేతాభ్రికపు రేకుల మధ్యబెట్టి బొగ్గునిప్పులమీద బెట్టిన సింధూరించును.

క్షయప్రకరణమున మరియొక భస్మయోగమును చూడుడు

## —♦ గవ్వభస్మము. ♦—

జిల్లేడుపాలతో తడిపి పుటమువేసేది.

## —♦ ముక్తాభస్మవిధి. ♦—

[illegible]పండ రసమునసూరి పుటంవేసేది.



## —♦ పగడపుభస్మము. ♦—

నిమ్మపండ్లరసము లేక జిల్లేడుపాలలో భావన చేసి పుటంవేసేది.

పగడచూర్ణమునకు 4 వ వంతు శంఖపాషాణము కలిపి నిమ్మపండ్లరసముతో 3 దినములు భావనచేసి శరావసంపుటమందిడి గాఢపుటమువేసిన అత్యంత తీక్ష్ణవత్తరమైన భస్మమగును ఉగ్రమైన కఫమును గూడ కోయును మోతాదు వీసము.

## —♦ సర్వరత్న భస్మవిధానము. ♦—

వజ్రముగాగ తక్కిన రత్నములను మణిశిల గంధకము తాళకము కలిపి నిమ్మపండ్లరసమున నూరి 8 పుటములువేసేది. మరియు వజ్రముగాక తక్కిన రత్నముల నన్నిటిని పన్నీటితో గాఢముగనూరి చూర్ణించిన ఉత్తముగ పనిచేయును. ఇది యూనానీ సంప్రదాయము. వజ్రము సల్లిరక్తమునందు భావనచేసి కాల్చుచు కసివింద రసమున 7 సార్లు చల్లార్చవలెను.

## —♦ సువర్ణభస్మము. ♦—

మాదీఫల రసముతో నూరిన రస భస్మమును పట్టించుచు 10 పుటములు వేయవలెను.

## —♦ రజతభస్మము. ♦—

రేకులుకొట్టి కాల్చి పచ్చములు గోరింటాకు స్వ రసమునందు పెళుసుఅగువరకు చల్లార్చి ఆయాకుమ

ద్దలో నీరేకులనుంచి మూకుడులోపెట్టి దానిస్వరస మునే పూరించి చీలజేసి గజపుటమువేసేది.

2 ప్రకరణము.

పొడిరజమునకు రెట్టింపు కోడిగ్రుడ్డు పెంకులను చేర్చి మాదీఫలరసముతో మర్దించి కోలిమిలోనుంచి గాఢముగా నూదవలెను. 8 నాళ్లుచేసేది.

—♦ అఘోరీ యోగము. ♦—

నరమలమునందు రూపాయిని మూడుదినములు నిలవయుంచి నాల్గవదినమున పరిశుద్ధముగకడిగి మూ ర్కొండాకు ముద్దలోపెట్టి కవచమిచ్చి 100 పిడకల లో పుటమువేసిన స్వచ్ఛముగ భస్మమగునని ఒక వాద గ్రంథమున కలదు.

—♦ తామ్రభస్మము. ♦—

4 వ భాగము గంధకమును నిమ్మపండ్లరసముతో నూరి రేకులకు పట్టించి పుటము వేయవలెను. ఇట్లు 4 పుటములువేసి వస్త్రగాలితముగానించి నిమ్మపండ్ల పులుసులో 20 దినములు భావన చేయవలెను. ప్రతి దినమును కొత్తరసమును పోయుచుండవలెను. పిదప బిళ్ళలుచేసి అడవికంద దుంపలోబెట్టి గుడ్డచుట్టి మూ కుడులోపెట్టి పుటము వేయునది. ఇట్లు 5 పుటము లువేసిన రాగి ఛర్దిలేని భస్మమగును. ఇత్తడి కంచు కూడ పైవిధముగ చేయవచ్చును.



కరివేపాకురసముతో నూరి 10 పుటములు వేసిన భస్మమగును.

సమముగ కజ్జలిని చేర్చి నిమ్మపండ్లరసముతో నూరి పుటము వేయునది. ఇట్లు 6 పుటములును జిల్లేడుపాలు అడవికందరసము పులిచింతాకు చింతాకు కరివేపాకు లతో రెండేసి పుటములు వేసిన భస్మమగును.

—♦ ఖడ్గలోహ సిందూరము. ♦—

గంటములు లేక సిరంగికత్తులు వీని రజము వొక మూకుడులో నుంచి గోమూత్రము నిండు గపోసి యెండినపిదప ఇనుప ఖల్వములో దంచి వస్త్ర గాలితము చేసినచో కొంతతుప్పు క్రిందకుదిగును. అంతయు తుప్పుగపరిణమించువరకు పైవిధముగచేసి జిల్లే డుపాలు అడ్డసరము దూసరితీగ వావిలి కలబంద చిత్రి గుంటగలగర తెల్లగలిజేరు త్రిఫలకషాయము నల్లేరు నిమ్మపండ్లరసములతో నూరుచు పుటములువేసేది.

12 వ వంతు ఇంగిలీకము చేర్చి కలబందరసముచే మర్దించి 12 పుటములువేసిన భస్మమగును.

4 వ వంతు గంధకమును చేర్చి నిమ్మపండ్లు నల్లేరు చాగ అడ్డసరము తిప్పతీగ పులిచింత గోబ్బి త్రిఫల కషాయము అల్లము రసములతో వారి తరముగువరకు పుటములు వేయవలెను.

## కాంతము.

కుందేటినెత్తురు త్రిఫలకషాయములతో మూడేసి పుటములువెట్టి పిదప 20 భాగము ఇంగిలీకమును చేర్చుచు కాంజికముతో నూరుచు 20 పుటములు వేయవలెను.

## వంగభస్మము.

వంగమును రేకులుగొట్టి చింతాకులవలె కత్తిరించి పచ్చతంగేడాకులలో చల్లి గోనెపట్టలోచుట్టి పైన మన్ను పూసి పిడకలలో పుటమువేయునది. పేలాలవలెపొంగిన వంగమునుదీసి కలబందవేళ్ళ రసము లేక నిమ్మపండ్ల రసముతో నూరి ఒక పుటమువేసేది.

వంగమునకు సమముగ సురాకారమును గ్రహించి వంగమును కరిగించి కొంచెము కొంచెము సురాకారమును వేయుచు ఇనుప గుదియతో మర్దించుచుండవలెను. కొంతసేపటికి వంగము మిక్కిలి మెత్తనైన చూర్ణమగును. దానిని నీళ్లుపోసి పిసికి ఒక గంట నిల్వయుంచి తేరిననీరు పారబోయువలెను. ఇట్లు 20 సార్లు కడిగి యెండించి కలబంద బియ్యపుకడుగులతో మర్దించుచు 4, 5 పుటములు వేయవలెను.

పై విధముగ వంగమునకు రెట్టింపు కర్పూరములను క్రమముగ వేయుచు మర్దించునెడల మిక్కిలి శ్రేష్ఠమగు భస్మమగును. హెచ్చుగ పనిచేయును.



## వంగసిందూరము.

ఇనుపమూకుడులో కరగించి సురాకారమును కొంచెముగ వేయుచు వేయించవలెను. వంగము బాగుగా చూర్ణమైనపిదప కాంజికములోబోసి ఒక రాత్రి నిలవయుంచి పై కాంజికమును పారబోసి ఆర బెట్టి 8 వ భాగము తాళకమును చేర్చుచు నిమ్మపండ్లరసముతో నూరుచు 14 పుటములు వేయవలెను.

## సత్తుభస్మము.

సత్తును కరిగించి చిత్రివేళ్ళను వేయుచు మర్దించుచుండిన స్వచ్ఛమైన భస్మమగును. దీనిని నేత్రవ్యాధులలో గూడ వాడవచ్చును.

## నాగసిందూరము.

సీసమును ఇనుపమూకుడులో నుంచి చింతబెరళ్ళ క్షారమును వేయుచు వేయించి వస్త్రగాలితముచేసి కోడిగ్రుడ్లు పచ్చతంగేడాకు నల్లేరు కలబందవేళ్ళు తెల్లగలిజేరు నిమ్మపండ్లు వీనిరసములతో మూడేసి పుటములు వేసేది. పుటములకు క్రమముగ 15 మొ॥ 50 పిడకలవరకు వృద్ధిచేయుచుండవలెను.

సీసమునకు రెట్టింపు పసుపు గ్రహించి పై విధముగ కొంచెము కొంచెము వేయుచు వేయించినచో మిక్కిలి మనోహరమైన సిందూరమగును.

### —♦ మండూరము. ♦—

గోమూత్రము త్రిఫల కషాయములతో ప్రక్షేము 5 పుటములు వేసెద.

### —♦ శృంగిభస్మము. ♦—

దుప్పికొమ్ములను పేళ్ళుగాకొట్టి జిల్లేడుపాలతో తడిపి యెండించి పుటము వేయవలెను. పిదపదాని మినపపిండితోను ఆవుపాలతోను చేర్చియొక పుటవ వేసినచో స్వచ్ఛమగు భస్మమగును.

### —♦ శంఖభస్మము. ♦—

రాసున్నములో ముంచి పుటము వేసెది.

సమాప్తము.



